(excursion) ఎక్స్కర్షన్ వచ్చిన కాలేజీ విద్యార్థులు కాఫీ కోసం తొక్కు-కుంటో, అటూ ఇటూ కళ్ళెత్తిన పాపాన పోలేదు.''

"సరేలే కానీ, అట్లానే పంపకం పెట్టిద్దాము. నీ కథకానీ."

"అవును. మూడేళ్ళు తిరిగాము. రమకి మాత్రం చదువు రానేలేదు. ఎట్లాగో ఇన్టర్ దాటింది. కడుపు వొచ్చింది. రెండో నెలలో నాతో చెప్పింది. వెంటనే యేమీ ఆలస్యం కాకండ ఎవరో ఒకర్ని పెళ్ళి చేసుకోమన్నాను."

"ఆ, ఆ. ఆ," అరిచాడు శ్యామూరావు ఆశ్చర్యంతో, అసహ్యంతో, ఆ మాటలు తన చెవులు నమ్మలేనట్టు అది మూలుగులాగ వినపడ్డది రాజయ్యకి.

"ఏమిటది ? యేమన్నా నెప్పా ? "

"ఆ! చాలా నెప్పి! పెళ్ళి చేసుకోమన్నావా ? ఎట్లా అన్నావు ఆ మాట?''

"యేమి?''

"సరేలే. రమ యేమంది?''

"ఒప్పుకోలేదు.''

"ఒప్పుకుంటుందని కూడా అనుకున్నావా యేమిటీ? చాలా గొప్ప వాడివి. ఆ పిల్ల మనిషా, కొయ్యబొమ్మా?''

"అంతకన్న యేం చేస్తుంది?''

"అదేలే. ఎందుకు చేసుకోనంది?''

"ఏమో! అనడం నామీది ఇష్టం వల్లనంది. 'ఇష్టానికేం ఇష్టం వుండనీ. పెళ్ళి కాక యేం చేద్దామని ?' అని బలవంతం చేశాను."

"రాస్కెల్!''

"ఆగు ఆగు. మాటలనడం సులభమే. ఆ పరిస్థితిలో నువ్వేం చేసేవాడివి ?''

"అసలు ఆ పరిస్థితి రానీను."

"ఎట్లా ? అసలు ఆ సంబంధం నించి చల్లగా తప్పుకుంటా నంటావు దొంగమళ్లే. సరే. అంతవరకూ ఏ పొరపాటునో దిగావనుకో."

"నేనే భరిస్తాను."

"పెళ్ళి చేసుకునా?"

"అదన్నా సరే."

"ఇద్దరు పెళ్ళాల్ని ఓ యింటో పెట్టి! నీకేం. గవర్నమెంటు నౌకరివి. తెల్లవారితే నా బతుకు నలుగురి జేబుల మీదా ఆధార పడ్డదోయ్. ఎంత జాగ్రత్తపడ్డాను! మరి రమని కాలేజీకి పంపడం, శలవలో ఇద్దరం విడివిడిగా ప్రయాణం చేసి యెక్కడో కలుసుకోడం, అంతదూరంలో తెలుగు మొహం కనపడితే ఆ చోటినుంచి పలాయనం కావడం- ఎవరికీ తెలీదనుకో. మరి పెళ్ళి చేసుకోనా ? ఆనాడు చేసుకోవచ్చుననుకో. బుద్ధిగల బ్రిటిష్ ప్రభుత్వం తప్పుడు బిల్లులు అల్లకండా మన కాశీశ్వర్రావుని జైలులోనే వుంచింది అప్పుడు. కాని నా కూతురు యీడు వున్న ఆ పిల్లని...."

"పోనీ పెళ్ళి లేకండానే...."

"వూరికే నాన్సెన్సు మాట్టాడకు. ఆ పిల్ల భవిష్యత్తు...."

"యేమన్నా అను. యేం చేసినా, ఎన్ని కష్టాలుపడ్డా, నాశనమై పోయినా, ఆ పిల్లని ఇంకోడికి అంటకట్ట చూడటం-ఆ పిల్లకి, ఆ వరుడికి చాలా అన్యాయం."

"అన్యాయం-అనడంతో సరిపోతుం దనుకున్నావా? ఈ idealiste (ఐడియలిస్ట్) అట్లానే తమ జీవితాల్ని ధ్వంసం చేసుకుని, ఇతర జీవి తాల్ని నాశనం చేసేది. నాశనమైనా సరేట. నాశనమయ్యే పని ఎందుకు చెయ్యాలి? తప్పించుకునే మార్గంవుంటే?"

"నీ ఆనర్?"

"నా కట్లాంటి బుద్ధి తక్కువ ఆనర్ లేదు. అన్నీ కొన్ని మాటలు ఏర్పడ్డాయోయ్. వాటికి అర్థంగాని, ముఖ్య మొహంగాని యోచించరు. కాలంతో అవి మారతాయనీ, వాటి అర్థమే మారుతుందనీ తెలుసుకోరు. వాటినే పట్టుకుని వేళ్ళాడతారు. వేళ్ళాడి గోతుల్లో పడండి. కాని అవే గొప్ప అని, వాటితో ఇతరుల కార్యాల్నీ జీవితాల్నీ కొలవకండి. మీరే గొప్ప అని మీ మనసుల్లో కులక్కండి. ఆ మాటల్లో యెంతస్వార్థం వుందో, ఇబ్బందిలోంచి తప్పించుకోడానికి అవి ఎంత వీలైన దొంగ మార్గాలో మరచి పోతారు. Practical (ప్రాక్టికల్‌గా) యోచించడం నించి, కార్య దక్షత నించి, ఇతరులకి ఉపయోగపడే అవసరం నించి, సులభంగా తప్పి స్తాయి—ఈ నీతీ, ధర్మం, ఆనర్, దేవుడూ ఇట్లాంటివి. మీ కంటే ఓ పాఠం యెక్కువ నేర్చుకున్న వాళ్ళున్నారు. వేదాంతులు. ఈ లోకమే మాయ అని ఎవరికీ ఏమాత్రం సహాయపడకుండా, అసలు ఆ యోచనే చాలా భారమై, మనసుల్ని కట్టేసుకుని తమ గూళ్ళల్లో నవరంధ్రాలూ మూసుకుంటారు. ఎవరూ చూడకుండా, వీలైనప్పుడల్లా, లటుక్కున ఏ ధనాన్నో, యే ఆడదాన్నో వేసుకుని, చప్పున మళ్ళీ గుంటలో దూర తారు. ప్రశ్నగాని, బాధ్యతగాని వొచ్చిందా అసలు పలకరు, వాదించరు— అంతా మాయ, అహం బ్రహ్మాస్మి అంటారు."

"కాకపోతే లోకం నిజమంటావా?"

"మాయా? మాయ ఐతే, ఆ మాయ అనేవా డెవడు, వినేవా డెవడు?"

"సర్వం ఏకం."

"నిజంగానే ఇదంతా మనకి యేకంగా కనపడ్డప్పుడు యేకం అందాం. ప్రస్తుతం భిన్నమేగా—ఆ తప్పుడు మాట లెందుకు? చౌర్యానికి, వేరే దేన్నించో తప్పించుకోడానికి. ముఖ్యంగా తమనించి. వాళ్ళల్లో సిన్

సియర్ మనుషులు లేకపోలేదు, నీ జోటి వాళ్ళు. వాళ్ళనుకునే నీతి, ఆనర్, పద్ధతులకి ఈ ప్రపంచం విరుద్ధం, భరించలేక కళ్ళు మూసుకుంటారు, మాయ అని. ప్రేమ భగ్నమైన మనిషి స్త్రీని తిట్టి ప్రేమ అనేది వుత్త కవిత్వమనడూ—అట్లాగే."

"చివరికి ఏం చేశావు?"

"పెళ్ళి చేశాను, భాస్కరరావు కిచ్చి. నువ్వు చూశానన్నావుగా అతన్ని?"

"అతని మొహం ఎట్లా చూడగలిగావో! నీ ఉంపుడు కత్తెని అతనికి అంటకట్టావు. పైగా నీ పిల్లని అతని పిల్లగా. అతను మోసపోయి యావజ్జీవనమూ పోషించేట్టు చేస్తున్నావు. ఆ మోసాన్ని యెట్లా భరించావో!"

"నీ మాటలెట్లా వున్నాయంటే—ఈ భూత దయగాళ్ళు—నిలువునా కోడిప్రాణం ఎట్లా తీశావు అంటారు, ఆశ్చర్యంగా. వాళ్ళ కళ్ళ యెదటే ప్రతి నిమిషం లెక్కలేని ప్రాణులు చస్తూవుంటే, ఒకదాన్ని ఒకటి మింగుతో వుంటే."

"వున్నారులే ఘాతకులూ, మోసగాళ్ళూ, నువ్వొ అంతేనా అని...."

"పెద్దపులిని చంపడమూ ఘాతుకమేనా? ఆ మోసం చెయ్యకపోతే కలిగే ఘోరాల్ని తలుచుకో."

"సరేలే. ఈ గొడవలో ఆ తల్లి యేం చేస్తోంది?"

"ఆ కథ తరవాత చెపుతా. రమకి పెళ్ళి చేసేశాను ఆ భాస్కరరావుకి, నువ్వు చూశావుగా!"

"ఎట్లా దొరికాడు అంత సులభంగా?"

"నాతో తిరిగేప్పుడు రమ నా కూతురు. అందుకని యువకులు కొంత వెంటపడేవారు. రైల్లో తటస్థపడ్డాడు ఈ భాస్కరరావు. అతనూ

అజంతాకి వొచ్చాడు. మే మక్కడ వుండగా రమ వెంట పడ్డాడు పెళ్ళి చేసుకోమని. నవ్వేసి అతని నించి తప్పించుకున్నాము. రమ కాలేజి ఎడ్రసు తెలుసుకుని, ఆమెకి ప్రేమలేఖలే గాక, ఆమెని చూడ్డానికి కూడా వెళ్ళే వాడు. కాని లాభంలేదని చెప్పేసింది రమ. ధనవంతుడు, భార్యని వొదిలే శాడు, కనక రమనిచ్చి పెళ్ళి చేశాము."

"వ్యభిచారం చేయించా వన్నమాట."

"అర్థంలేని మాట మానెయ్యి. 'స్త్రీ' అనే పుస్తకం చదువు. కొంచెం మాటలకి అర్థాలు తెలుసాయి."

"పోనీలే రమకి నీమీద కదా యిష్టం?"

"అవును. నేనేం మారానా? మరీ నిలవలేనప్పుడు నా దగ్గిరికి వొస్తోనే వుండేది."

"పెళ్ళి ఐనాక కూడానా?"

"ఊఁ"

"ఏమిటి! రానిచ్చేవాడా?"

"నేను గార్డియన్ని కదూ!" అని నవ్వాడు రాజయ్య.

"ఘోరం. ఇంక మాట్లాడకు. భరించలేను" అని శ్యామారావు లేచిపోయి కిటికి దగ్గిర నుంచున్నాడు. రాజయ్య నవ్వుతున్నాడు.

"ఈ సంగతులు తెలిస్తే నువ్వు నన్ను నీ యింటికి రానిచ్చేవాడివే కాదనుకుంటాను. ఇంక నా పిల్లనేం చేసుకుంటావు నీ కొడుక్కి.... కాని ఇది తెలుసుకో. ఎక్కడో నీవంటి వెర్రివాళ్ళు తప్ప, అందరూ ఇట్లాంటి పనులు సమయం వొస్తే చేసేవారే. అక్కడే ఈ కర్మ వేదాంతంతో, పుణ్యపాపాలతో నా తగాదా. కొందరికి పాప కార్యాలు చేసే అవసరం కలుగుతుంది. కొందరికి కలగదు. అవసరం వల్ల చేసినవాళ్ళు పాపాత్ములు ఆ అవసరం లేక చెయ్యనివాళ్ళు పుణ్యాత్ములూనా? భయంవల్ల మానేసే భీరులు అంతకన్నా పవిత్రులు. ఇంక పోలీసు వాళ్ళ కన్న ఏం గొప్ప ఆ దేవుడు?"

"అదంతా పోనీ, ఆ పిల్ల యెటువంటిదో మధ్య మధ్య నీ దగ్గిరికి రావడానికి?"

"ఎటువంటిదీ కాదు. చాలామంది కుటుంబ స్త్రీలకన్న ఉత్తము రాలు. ఆ పిల్లకి వీలు చిక్కింది. అంతే."

"నేను నమ్మను. వంశంలోనే ఉంటుంది ఆ గుణం. విశాలాక్షికి తెలుసా ఇదంతా? ఏమయింద అన్నేళ్ళూ కూతుర్ని నీకు వప్పచెప్పి?"

"చెప్తా ఆ కథ. విశాలాక్షి ఏమీ దుర్మార్గురాలు కాదని నీకు తెలుసు. కూతురు కథ విని అమాంతం నువ్వు ప్రేమించిన పిల్లని నరకంలోకి తోసేశావు. లోకం ఎంత మారిపోతోందో! మారడమంటే, ఇదివరకు రహస్యంగా జరిగేవి ఇప్పుడు ధైర్యంగా బహిరంగంగా జరుగుతున్నాయి. అదే మార్పు. నీవంటి వాళ్ళ మనసులు మాత్రం ఇంకా చీకట్లో కళ్ళు మూసుకుని 'యేంలేదు' అని పాతకలలు కంటున్నాయి. ఈ లోకమంతా నరకానికి పోతే మనమూ పోదాంలే. మనం మాత్రం స్వర్గానికి పోయి యేం చేస్తాం అక్కడ, యేం తోచకంజా ?"

"సరేలే. చివరి కేమయింది?"

"ఏం కాలేదు. కథ అనుకున్నావా యేమిటి, అతనికి నిజ తెలీడం, రమని ఒదిలెయ్యడమూ అదీ? అదంతా కథల్లో. నెలలు నిండకుండా పిల్ల పుట్టిం దన్నారు. ఆ పిల్లా హాయిగా ఉంది. నువ్వు చూశావు కదూ? అది నా కూతురు. తరవాత పిల్లలు లేరు."

"ఆ పిల్ల సరిగా విశాలాక్షి మల్లే ఉంది అనుకున్నాను, మీ ఇంటికి వచ్చినప్పుడు."

"అవును."

"తరవాత?"

"అతనికి గ్రీక్ భాష వొచ్చుట. అందుకని గ్రీసు దేశానికి మన రాయబారిగా వెళ్ళాడు."

"నవ్వేలాటా?"

"కాదు. ఇంకా ఆ రోజుల్లో అనేవాళ్ళం. Penguin (పెన్గ్విన్) బొమ్మలు గీశాడని, Antarctic continent (అంటార్కిటిక్ కంటినెంట్ కి) రాయబారిగా వెళ్ళాడని. కాని వెళ్ళింది నిజం. భార్యతో, పదేళ్ళ కూతురుతో వెళ్ళాడు."

"అంతేనా?"

"అంతే.

"విశాలాక్షి?"

"చచ్చిపోయింది కదూ! నాలుగేళ్ళయింది."

"నీ కెట్లా తెలుసు విశాలాక్షి — కాలేజీ రోజుల తరవాత ? ఆ సంగతి చెప్పు. అన్నట్టు చెప్పావుగా, నీకూ ఆమె మీద ప్రేమ అని. ఒక్కసారీ చూచాయగానన్నా తెలియ నివ్వావు కావు."

"ప్రేమ అన్నానా ? అవునులే. కాని నీతో చెప్పడ మెందుకు ? అదో అవస్థ నీకు ! చెప్పితే ఏం చేసేవాడివి ? నేను చెప్పాను కదూ, అనవసరంగా బతుకు బయలు చేసుకునే రకం మనిషిని కానని !"

"ప్రేమ ఫలితం కూతురులో అనుభవించావులే. కాని విశాలాక్షి అందం ఎక్కడ ! రమకి ఎక్కడ వుంది ఆ అందం ?"

"అందమే ప్రధాన మనుకోకు. రమ రతి చాతుర్యం (ఆ మాట అనలేదు రాజయ్య, రాయడానికి వీలులేని బూతు మాట అన్నాడు) విశాలాక్షికి ఏం చేతనౌను ?"

"అదేమిటి ? విశాలాక్షి రహస్యాలు నీకేం తెలుసు ?"

రాజయ్య మాట్లాడ లేదు.

"ఏం మాట్లాడవు ?"

"మా అత్తవారి వూరూ, విశాలాక్షి అత్తవారి వూరూ ఒకటే."

"ఓహో ! చాలా ప్రబుద్ధుడివోయ్. ఇళ్ళు కూడా ప్రక్క పక్కనేనా ?"

"కాదు."

"ఆమె భర్త అసమర్థుడా ? అనామకుడా ?"

"ఏమీ కాదు. నాకు చాలా మిత్రుడు."

"ఓహో ! ఆ మోసం కూడానా ? చూడ్డానికి ఇట్లా వున్నావు గాని, చాలా వ్యవహార కర్తవి."

"అట్లాంటి దేమీ కాను. నన్ను మరీ ద్రోహి కింద జమ కట్టకు. అతని మీద నాకు చాలా గౌరవం—అదే విశాలాక్షి భర్త చక్రపాణి మీద. అతని మీద విశాలాక్షికి గొప్ప ప్రేమా, గౌరవం. అతను చచ్చిపోయినాడు రమకి పధ్నాలుగేళ్ళప్పుడు"

"అప్పుడు తమరు వోదార్చారా ?"

"అప్పుడు ఆ కుటుంబ వ్యవహారాలు నేను చూడాల్సి వొచ్చింది. అందువల్ల రమ నన్ను తన గార్డియన్ కింద...."

"తండ్రి కింద అను. నీకేం జంకు, నిండా మునిగిన వాడికి !"

"వుండవోయ్ ? భర్త ఆస్తి అంతా చిక్కుల్లో పడ్డది. అవన్నీ విడతీసేప్పటికి యేమీ మిగిలేట్టులేదు. ఆ విచారంతో విశాలాక్షికి దైవ భక్తి ముంచుకొచ్చింది. అదేదో ఆశ్రమం తిరపతి దగ్గిర, అక్కడికి పోయింది."

"ఎప్పుడు ?"

"భర్త పోయిన మూడేళ్ళకి, రమ నీ కాలేజీలో ప్రవేశిస్తుందనగా. నువ్వక్కడ వున్నావని తెలీదు. తెలిస్తే నేను స్వయంగా రమని నీకు వప్పగించేవాడిని."

"ఆ మూడేళ్ళల్లో నువ్వేం చేశావు ? నీ మూలానే నేమో విశాలాక్షి ఆ ఆశ్రమానికి వెళ్ళింది."

రాజయ్య బిగ్గరగా నవ్వాడు.

"ఎందుకు నవ్వుతావ్ ?"

"మీ నీతిపరుల కున్నంత nasty minds (నాస్టీ మైండ్స్) మురికి మనస్సులు ఎవరికీ వుండ వనుకుంటాను. అదే గోల కదా ! అదంత ప్రాముఖ్యమా ? అంతకన్న ముఖ్యమైన సంగతులు లేవా ? ఓ మొగాడూ ఆడదీ పడుకోడమనేది అంత అసాధారణమూ ఘోరమూ యెందు కవుతుంది మీ మనసులో ? నిత్యమూ నీ చుట్టూ సృష్టి అంతా లక్ష విధాల జరుగుతున్న పని ! అసలు మీరు ఆ విషయం జోలికి పోరు. కాని అది మీ సమీపంలో యెక్కడన్నా జరిగినట్టు వుందా, ఇంక దాన్ని పని కట్టుకుంటో ముక్కుని ఆ వాసనమీదనే కేంద్రీకరించి వెతుకు 'రు. గాటియర్ రాస్తాడులే, ఈ విమర్శకులు కథల్లో బూతు భాగాల దగ్గరికి, పందులు బురద కుళ్ళని వెతుక్కుంటో పోయినట్టు పోయి కెలుకుతారట. కెలికి బాగా చప్పరించి, మనసు మురికి అయిందనీ, జిడ్డు పట్టిందనీ అరుస్తారు, మరి తనివితీరని ఆ ముట్టెలు ఒదిలిరావు ఆ స్థలంనించి ఓ పట్టాన. 'ఏం మిగిలింది ? ఏం మిగిలింది ?' అని యింకా వెతుక్కుంటాయి పాపం !"

"సరేలే. ఆ ఉపన్యాసం చాలు. నీ సంగతి చెపుదూ."

"అందువల్ల రమకి నేను గార్డియన్ అయినాను. ఆమె చదువుకి నేనే ఖర్చు చేశాను."

"ధనదానం, గర్భాదానం కూడా చేశావు తల్లి కీ, కూతురికీ కూడా. ఎట్లా ఒప్పింది నీ అంతరాత్మ ? రమ కూతురు నీదా, ఆ భర్తదా ?"

"నాదేనని చెప్పానుగా ?"

"అచ్చం విశాలాక్షి పోలిక. అంతా ఆ అందం. కాని నీకు అందంతో పనేమిటిలే !"

"వెక్కిరించకు. కథంతా విను. అప్పటికి దాచుకో తిట్లు. ఇంకా యెంత కోప్పడతావో !"

"ఊఁ" అన్నాడు శ్యామారావు బాధపడుతో.

"చిన్ననాడు నన్ను విశాలాక్షి ఇంటికి పంపించావు జ్ఞాపకముందా ?"

"నా మూలాన నీకు చివాట్లూ ప్రహారణాలూ...." అని కసిగా నవ్వాడు శ్యామారావు. అది జ్ఞాపకం తెచ్చుకుని అన్నాడు— "ఇన్నాళ్లూ అది తలచుకున్నప్పుడల్లా, నిన్నుగురించి దిగులుపడ్డాను. నా మూలాన అన్యాయంగా అవమానపడ్డావని. కాని—"

"పడితేనేం ! పర్యవసానమో ! ఇప్పటికన్నా తెలుసు కున్నావు. ఒచ్చిన నష్టం యేమీ లేదు. జీవితంలో ఎన్ని అవసరంలేని పశ్చాత్తాపాలు ! వకీలు వవు తెలుస్తుంది. నిజం తెలీకంవానే అట్లా కుములుతో చచ్చిన వాళ్ళెందరు ? మొపాసా 'నెక్‌లెస్' కథ యెంత నిజం ! ఎంత విషాదం !"

"అవును మరి. నన్ను విశాలాక్షితో మాట్లాడొద్దని యెంత plead (ప్లీడ్) చేశావు ! నా శ్రేయస్సు కోరేనా ? కాక నీకు ఛాన్సుకా ! దొంగ మాటలూ నువ్వూ !"

"అదే లోకం తెలీని అంధత్వం. మనుష్య స్వభావం తెలీని మూర్ఖం. ఎప్పుడో విశాలాక్షి ప్రియుణ్నయినానని, మొదటినించీ నా నిజాయితీనీ, స్నేహాన్నీ సందేహించడం అన్యాయం. సరే, అసలు యెంత సంకుచిత దృష్టి !"

"ఓ, అప్పుడు కాదా ?"

"విను మరి. నువ్వు పంపితే, నీ స్నేహంవల్ల అక్కడికి వెళ్లాల్సి ఒచ్చిందని, ఆ పిల్లమీద చాలా కోపంతోనే వెళ్ళాను. అటు తరువాత ఆర్నెల్లుగావును కాలేజీలో వున్నాము. ఆ ఆర్నెలల్లో నీతో మళ్లీ మాట్లాడలేదుకదూ ఆ పిల్ల, నువ్వు ఎంత ప్రయత్నించినా ?"

"అవును. బెదిరిపోయింది పాపం !.... పాప మేమిస్తే - తప్పదు...."

"ఆగు. అంతమాటే పవిత్రమైన నీ నోటినించి ! నీ మీద విశాలాక్షికి ప్రేమ అంటావా లేదా ?"

"కాక....కాదు....వుండు....దానికి ప్రేమేమిటి ? నేను ఉత్త fool (ఫూల్)ని అయినాను."

"కాదు. నిజంగా చాలా ప్రేమ."

"నీతో చెప్పకుందా ? ఎప్పుడు ? నీ కింద...."

"ఆపుకో కోపం. చచ్చిపోయింది. ఇప్పుడా.... అవును. నాతో చెప్పింది. అప్పుడేకాదు చచ్చిపోయేవరకూ నీ జ్ఞాపకం గొప్పగా నిలిచింది ఆమెలో. నీతో ఆమె అబద్ధం చెప్పలేదు. నిజమే నీ మీద ప్రేమ."

"నిజమైతేనేం ! అబద్ధమైతేనే ! ఏ మొచ్చింది ?"

"ఏం రావాలి ?"

అనేప్పటికె శ్యామారావుకి జవాబు తోచలేదు. తనకి యేం కావాలని వుందో. ఆ ఆశ వుందని తాను కూడా ఒప్పుకోలేదు.

"ఏం లేదులే. పోనీ నాతో స్నేహంగా నన్నా వుందా ?"

"ఛీ ఊరుకో. ఏ మొచ్చిందట ? ఏం వొచ్చేట్టు ప్రవర్తించావు ? స్నేహమా ? ఆ వయసులో వుత్త స్నేహం యెవరికి కావాలోయ్ ? తమ వాంఛ లేమిటో సరిగా తెలుసుకుని, వాటికోసం ప్రయత్నించే ధైర్యం లేని వాళ్ళ సంగతి ఇట్లానే అవుతుంది."

"ఏం చెయ్యాలంటావు ? ఆడ పిల్ల ప్రేమ అనగానే, నీకుమల్లే రోడ్డుమీద యెదురు వెళ్ళి మీద పడమంటావా ?"

"కాకపోతే ఆ పిల్లని నీపైన పడమంటావా ? గోడమీద పేర్లు చూసి జడుసుకున్న వాడికి నీకు ఆడపిల్ల లేమిటి ? అసలు గోడ మీదికి పేర్లు రానిచ్చిన వాడికి, ఆ పేర్లు కలవడం తప్ప......."

"ఇంకేమీ కలపలేని వాడికి!" అని వెక్కిరించాడు శ్యామా రావు.

"వుండు. అవును, ఇతరుల మీద నిందలెందుకు ? నువ్వే ఆనాడు నన్ను విశాలాక్షి ఇంటికి పంపకపోతే ఈ కథ జరగనే జరక్క పోను."

"ఓహో! అదీ నేనే?"

"అవును. ఆ తండ్రి నన్ను మెడ పట్టుకుతోస్తే గుమ్మం అవతల పడ్డాను. ఆకస్మికంగా జరిగింది ఆ పని. చివ్వున లేచి ఒక్క దూకు దూకాను ఆ ముసలాయన వేపు. కాని విశాలాక్షి అడ్డుపడ్డది. జ్ఞాపకం వుందా ?"

"విశాలాక్షి అడ్డపడ్డదని నువ్వు చెప్పినట్టు లేదు."

"అవును. చెప్పి ఉండను. అసలు ప్రారంభం అదే. ఆ మసకలో సరిగా చూడక తండ్రి అనుకుని ఆ పిల్లను గట్టిగా తోసివొచ్చాను. ఆ నిమిషాన తెలిసింది అది స్త్రీ శరీరమని. పైగా నన్ను అడ్డపెట్టానికి నా వేపు చేతులు జాచి నిలుచున్న పిల్లని యెక్కడ తోసి ఉంటానో ఆలోచించుకో. ఆ స్పర్శని నా చేతులు మరిచిపోలేదు. రాత్రంతా కలలు కన్నాను. నువ్వు నన్ను ఓదారుస్తున్నావేగాని, నా చేతులు నా తలలోకి పంపే ఆనంద తరంగాలలో అవమానానికి నా మనసులో స్థలమే లేక పోయింది."

"తరవాత వెంటపడ్డావా?"

"లేదు. నా చేతుల స్పర్శని విశాలాక్షి రొమ్ములు కూడా మరిచి పోలేదు. మనసంతా నీ మీద, ఒళ్ళు..."

"నీ మీద."

"అవును. ఒంటికి నా మీద కాంక్ష."

"ఒంటికంతా కాదుగా!"

"తక్కిన సంగతి నేను చూసుకున్నాగా!"

"అరి నీ తస్సాగొయ్యా! ఎట్లా? ఏం చేశావు?"

"నేనేం చెయ్యలేదు. నాకు అనుభవం లేదు. నువ్వు ఆమెకి లెన్డుచేసిన కెమిస్ట్రీనోట్సు ఆమె దగ్గిరే వుండిపోయింది. నీతో మాట్లాడ కూడదుగా! ఆ పుస్తకం నా కిచ్చింది నీకు ఇమ్మని. ఇస్తూ "సరిగాచూసి ఇవ్వండి. లోపల యేమన్నా కాయితాలు మరిచిపోయినానేమో" అంది. అప్పటికీ నాకు అర్థం కాలేదు. ఆమె సామీప్యంలో పరవశత్వమేగాని, నా చేతుల అనుభవాన్ని కళ్ళతో పునస్మరణ చేసుకుంటున్నాను, నా మనసులో ఆ పమిటనీ, జాకెట్టునీ, ఇంకా అడుగున వున్న పొరలనీ తొలగించి."

"లోపల చీటీ పెట్టిందా?"

"ఊఁ."

"ఏం? ఏమీ చాతకాదంటివి?"

"నీకు అట్లాంటి చీటే ఒకటి రాసివుండకూడదా? అని నీ యేడుపు. రాస్తే యేం చేసేవాడివి? యేం? చెప్పు...అసహ్యించుకునే వాడివి."

"ఏమో! యేం చేసేవాణ్నో!"

"ముందే తెలుస్తుంది ఆ సంగతి ఆడపిల్లలకి. ఇంకా పురుష డంటే తెలీనప్పుడు కూడా. అందుకనే నీకు రాయలేదు."

"ఏమో! ఎట్లా తెలుసు?"

"ఇప్పుడన్నా తెలీటంలేదా నీ మనసుకి, నువ్వేం చేసేవాడివో?... పోనీలే ఇప్పు డెందుకదంతా. ఆ సాయంత్రం..."

"ఆ చీటీలో యేముంది?"

"అవును. ఆ చీటీ చూసి - యేం రాసిందంటే - నా మూలాన నువ్వు చాలా అవమానపడ్డావు. తలచుకున్న కొద్దీ నాకు అవమానంగా వుంది. మరి నన్ను యెట్లా క్షమిస్తావో! నీ బాధని పోగొట్టేందుకు

నేనేం చెయ్యగలను? అని. అంతే. నా ఒళ్ళు పరవశమయింది."

"ఏముంది ఆ చీటీలో అంత ఒళ్ళు పరవశం కావడానికి?"

"చీటీలో యేం లేదులే. నా దగ్గిర ఆమె నుంచున్నప్పటి చూపు లోనూ, మాటలోనూ వుంది కథ అంతా. 'నండూరి' వర్ణించాల్సిందే."

"కనుబొమ్మ నూడాలి-కతలు తెలియాలి."

"కథల్లో కావ్యాల్లో ప్రియుల మధ్య గొప్ప గొప్ప సంభాషణ పెడతారా? అట్లా యే ప్రియులూ మాట్లాడరు ప్రపంచంలో!"

"నీ కెలా తెలుసు?"

"ఇందరు స్త్రీలలో-ఇన్ని రకాల వాళ్ళలో ఒక్కరూ నాతో అట్లా మాట్లాడలేదు. నాకు ఎప్పుడూ ఆ మాటలు రాలేదు. ఏ స్త్రీతోనూ పనులు చాతనైన వాళ్ళకి మాటలతో యేం పని? వుత్త మామూలు లోకాభిరామా యణం మాటాడతారు. కాని ప్రేమను మాట్లాడరు. ప్రేమని నోట్లోంచి కార్చుకోరు యెవరూ. అంతా చూపులో, మాట తీరులో, దేహ భంగిమలో, ముఖవర్చస్సు మార్పుల్లో కనిపిస్తుంది. అది కథకు డెలా పట్టుకోగలడు? అందుకని అసహజమైన సంభాషణ పూర్వకంగా ఆ effect (ఎఫెక్టు) తెప్పించాలని చూస్తాడు."

"సరేలే. నీ గొడవ కానీ."

"ఆమెకి రాశాను, 'నీతో మాటాడాలి' అని, దానికి జవాబులేదు. వారం తరువాత ఆ సాయంత్రం తన యింటికి రమ్మంది. అప్పటికి వెళ్లి యేం మాటాడతానో నాకు తెలీదు. వెళ్లాను."

"తండ్రీ?"

"ఏమో! నే నాలోచించ లేదు. అదంతా ఆమెకు వదిలేసి వుంటాను."

"చాలా పెద్ద మనిషివి!"

బైట అరుగు మీదే నుంచుని ఉంది. పక్క సందులోంచి రమ్మని చెయ్యి వూపింది. ఆ వేపున తలుపు ఉంది. గడియ తీసింది. లోపలికి వెళ్ళాను. సంజ చీకటి దీపం వెలిగించలేదు. కుర్చీ, బల్లా, పుస్తకాలూ కనిపించాయి. ఆమె స్టడీ రూం అనుకున్నాను.

"రా కూచో. ఏమిటి?" అంది.

"నా నోటి నుంచి మాట రాలేదు. ఆమె చీర నించి, తలలో మొగలి రేకుల నించి పరిమళం. కూచున్నాను. ఆమె కుర్చీకి పక్కగా నా దగ్గిరే నుంచుంది.

"మాటాడవేం?" అంది.

"ఆలోచిస్తున్నాను."

"అంత ఆలోచించాలా!" నవ్వింది.

"నా థాట్సు ఆగిపోయినాయి" అన్నాను.

"ఏం?"

తలెత్తి ఆమె కళ్ళల్లోకి చూసాను.

ఇలాంటివి యెన్నో జరుగుతాయి? అని అడగకు. నాకూ తెలీదు. మన పూర్వీకుల నించి రేస్‌లోనే వస్తున్నాయేమో! కాదు మృగాలలో వృక్షాల నించి కూడా తెలుస్తుందేమో! ఆ వాతావరణంలోనే మన మనసుకి తెలీకుండానే యెక్కడో లోపల పరస్పరంగా తగులుతుంది వాంచ. వాళ్ళకి తెలీకుండా కూడా, లోపలి వాంఛ పిలుస్తుంది. పై మనసులు లేక —లోపలి ఏ ప్లేన్ లోనో-పిలుపులు అందుకుంటాయి." అని ఆగి— "ఒక్క నీత్యంధులకు తప్ప" అని నవ్వాడు రాజయ్య.

"ఊ..."

(7)

"కుర్చీ చేతిమీది నా చేతికి నుంచున్న ఆమె చేతివేళ్ళు తగిలాయి. ఏ చెయ్యి కదిలిందో యేమో! అంతే. వేళ్ళ మధ్య వేళ్ళు. చూపుల మీద చూపు, బెదురుతోనే, ఆమె చెయ్యి పట్టుకుని లాగాను, యేమీ పాయిన్టు లేకండానే. ఆమె నా ఒళ్ళో వుంది. తక్కింది ఆమె పిరుదులు కింద నా ఒడి మాటాడింది. నా ఎదురుగా తిరిగి నా మీద ఒరిగింది. నా కళ్ళు మూతలు పడ్డాయి. ఏమిటి, శ్యామారావ్! మనం అమృతులమని అనుమానించాలా? ఆ అనుభవం! కిటికీలోంచి దేవతలు పూలు చల్లారనుకో నా మీద. యెన్నేళ్ళు బతుకు, ఆ నిమిషం మళ్ళీరాదు. తరవాత యెందరు స్త్రీలని తెచ్చుకో, ఆ మొదటి స్త్రీ స్పర్శ అంతే. లేచింది, నా బుజంమీద వేళ్ళు అలానే ఉన్నాయి.

"చాకలి వొస్తాడు దీపం పెట్టడానికి. వెళ్ళు" అంది.

"మరి..."

అక్కడ లేదు. లోపలికి వెళ్ళింది. నేను వొచ్చేశాను. అంటే నా గదిలో వున్నాను గనక వొచ్చేశా ననుకున్నాను."

"నీ 'మరి'...అలానే వుండిపోయింది."

"అంతే. మళ్ళీ పలుకులేదు ఆ పిల్ల నించి. పదిహేను రోజు లయింది. వీలుపడలేదేమో! ఎవరన్నా వొచ్చేరేమోనని. కాని పలక లేదు. కాలేజీలోనన్నా నా వంక కన్నెత్తి చూడలేదు. పది రోజులు చూసి రాత్రులు ఆమె ఇంటిచుట్టూ తిరిగాను. ఏం లాభం? చీటీ రాశాను. జవాబు లేదు. ఎట్లా అందివ్వను చీట్లు నా వంక రానిదానికి? రాత్రులు మాని సాయంత్రాలు ఆ సమయాల్లోనే వెళ్ళాను అటు, ఇంటి వాళ్ళ కళ్ళు తప్పించుకుంటో. బిచ్చగాడి మల్లే చీకట్లో పోదామా? ఇట్లాంటి పన్నాగాలు ఆలోచించాను."

"కావలిస్తే ఆ పిల్లే పిలుస్తుందని యోచించే బుద్ధిలేక పోయింది నీకు."

"అవును. అందువల్లనే జయం లభించింది. ఆడవాళ్ళ వ్యవహారాల్లో అట్లాంటి వివేకం వుందా, నోట్లో కరక్కాయే....రాత్రులు ఆ గదిలో చదువుకునేట్టు లేదు. దీపం వుండదు. మరి రాత్రి చాకలి దీపం తెస్తా డంది, మరి ఇప్పుడు యెందుకు ఆ గదిలో రాత్రులు చదువుకోడం మానేసింది? అని కోపం వచ్చింది నాకు. కాని ఆ పిల్లకి నే నొస్తానని భయమన్న స్పష్టమైన సంగతి తెలీలేదు నాకు. స్త్రీ భయపడ్డదా, ఇంక లొంగిపోవడానికి అట్టే శ్రమపడనక్కర్లేదనీ, ఆనాడు తెలీదు. నన్ను తప్పించుకుంటోందని కోపం.

"దాంతో 'డెస్పరేట్' అయినాను. ఓ సాయంత్రం చీకట్లో వెళ్ళి సందులో యెవరూ లేకుండా చూసి తలుపు దబ దబ బాదాను. లోపల్నించి చాకలిగావును 'యెవరు?' అంటూ తలుపు తెరుస్తున్నాడు, పరుగెత్తి వెళ్ళి పోయినాను. నాకు చదువులేదు, యేంలేదు. అదే పని-అదే యోచన. నాలుగు రోజులు ఆగి మళ్ళీ అట్లానే తలుపు కొట్టాను. 'యెవరు?' అంది కోపంతో విశాలాక్షి. ఇంకా గట్టిగా కొట్టాను. కిటికీ దగ్గరికొచ్చి తొంగి చూసింది. నేను కనపడలేదు. చూసి తప్పుకున్నాను. మళ్ళీ తలుపు కొడుతూ, 'నువ్వు తెరిచిందాకా వదలను' అన్నాను. ఆ చప్పుడికి యెదురింట్లో యెవరన్నా చూస్తారని కూడా ఆలోచించలేదు. లోపలికి తల తీసుకుంది ఇనుపకమ్మలనించి, నిశ్శబ్దం. తలుపు దగ్గిరిగా నుంచుని— "ఎందుకు?" అంది.

"తలుపు తియ్యి చెపుతాను."

"ఇప్పు డెట్లా? మనుసులు."

"ఎప్పుడు ఐతే?"

"ఇంకో గంటపోయి."

"నిజమా?"

"ఊః....చూడు. గదిలో దీపం కనపడితే తలుపు కొట్టకు. కనపడక పోతే మెల్లిగా కొట్టు. అంత చప్పుడేమిటి?" అంది.

ఆ గంట యెట్లా గడిపాను? అబద్ధమా? మోసంచేస్తుందా? తన్ని స్తుందా? ఈ ఆలోచనలన్నీ రావలసిందే. ఆ వయసులో రావు. అదంతా వయసు ముదిరినాక. గంటకే వెళ్ళానో, ఇంకా ముందుగానో: గదిలో పెద్ద దీపం. కానీ యెవ్వరూ వున్నట్టులేను. మళ్ళీ పోవడం-ఓ గంట జరిగిం దనుకుని ఐదునిమిషాలకే రావడం....అట్లా యెన్నిసార్లో! మరి ఎన్ని గంటలయిందో! దీపం లేదు. నిశిరాత్రిలాగుంది. జనసంచారమే లేదు. ఆ తలుపు అవునో కాదోకూడా తెలీదు. మెల్లిగా చప్పుడు చేశాను. ఏమీ చలనంలేదు. ఇంకొంచెం గట్టిగా. ఉహూ. ఏంచెయ్యను? చూశావా? ఎంత మోసం చేసిందో! కసి ఎక్కువయింది. దీన్ని ఒదలకూడదు. ఇంటికి ఎట్లా వెళ్ళను? ఎట్లా నిద్రపోను? తెగించి ఆ మెట్లమీద కూచున్నాను. ఏం ఆశో తెలీదు. ఎదురుగా రంగులు మారే నక్షత్రం వెలుగుతోంది. కుంటి కుక్క తిండికోసం వెతుక్కుంటోంది. మా అమ్మ చూస్తే ఆ స్థితిలో-అను కున్నాను. ఇట్లా ఏవో అర్థంలేని ఆలోచనలు. కాని యవ్వనం. నిద్రపట్టింది గావును తలుపుమీద ఒరిగాను గావును. రెక్క తెరుచుకుంది. వెనక్కి పడ్డాను. అప్పటికి తెల్లారుతోంది. ద్వాదశినాటి చంద్రవంక ఉదయించింది అని ఈ నాటికీ జ్ఞాపకం. అన్ని గంటలూ తలుపు తెరిచేవుంది. ఉలిక్కి పడ్డాను. రెండునిమిషాలకిగాని జ్ఞాపకం రాలేదు. నిలుచుని మెల్లిగా నడిచాను. ఏం లాభం? ఎవ రుంటారు? మోకాళ్ళకి మంచం కొట్టుకుని కాళ్ళల్లో నరాలు జిల్లుమన్నాయి. మూలిగి మంచంమీద పడ్డాను. కాని విశాలాక్షి మీద....నన్ను గట్టిగా కావిలించుకుని, నామీదికి దొర్లింది...."

బైట అరుగు మీదే నుంచుని ఉంది. పక్క సందులోంచి రమ్మని చెయ్యి వూపింది. ఆ వేపున తలుపు ఉంది. గడియ తీసింది. లోపలికి వెళ్ళాను. సంజ చీకటి దీపం వెలిగించలేదు. కుర్చీ, బల్లా, పుస్తకాలూ కనిపించాయి. ఆమె స్టడీ రూం అనుకున్నాను.

"రా కూచో. ఏమిటి?" అంది.

"నా నోటి నుంచి మాట రాలేదు. ఆమె చీర నించి, తలలో మొగలి రేకుల నించి పరిమళం. కూచున్నాను. ఆమె కుర్చీకి పక్కగా నా దగ్గిరే నుంచుంది.

"మాటాడవేం?" అంది.

"ఆలోచిస్తున్నాను."

"అంత ఆలోచించాలా!" నవ్వింది.

"నా థాట్సు ఆగిపోయినాయి" అన్నాను.

"ఏం?"

తలెత్తి ఆమె కళ్ళల్లోకి చూసాను.

ఇలాంటివి యెన్నో జరుగుతాయి? అని అడగకు. నాకూ తెలీదు. మన పూర్వీకుల నించి రేస్‌లోనే వస్తున్నాయేమో! కాదు మృగాలలో వృక్షాల నించి కూడా తెలుస్తుందేమో! ఆ వాతావరణంలోనే మన మనసుకి తెలీకుండానే యెక్కడో లోపల పరస్పరంగా తగులుతుంది వాంచ. వాళ్ళకి తెలీకుండా కూడా, లోపలి వాంఛ పిలుస్తుంది. పై మనసులు లేక —లోపలి ఏ ప్లేన్ లోనో-పిలుపులు అందుకుంటాయి." అని ఆగి— "ఒక్క నిత్యంధులకు తప్ప" అని నవ్వాడు రాజయ్య.

'ఏం...'

"కుర్చీ చేతిమీది నా చేతికి నుంచున్న ఆమె చేతివేళ్ళు తగిలాయి. ఏ చెయ్యి కదిలిందో యేమో! అంతే. వేళ్ళ మధ్య వేళ్ళు. చూపుల మీద చూపు, బెదురుతోనే, ఆమె చెయ్యి పట్టుకుని లాగాను, యేమీ పాయిన్టు లేకండానే. ఆమె నా ఒళ్ళో వుంది. తక్కింది ఆమె పిరుదులు కింద నా ఒడి మాటాడింది. నా ఎదురుగా తిరిగి నా మీద ఒరిగింది. నా కళ్ళు మూతలు పడ్డాయి. ఏమిటి, శ్యామారావ్! మనం అమృతులమని అనుమానించాలా? ఆ అనుభవం! కిటికీలోంచి దేవతలు పూలు చల్లా రనుకో నా మీద. యెన్నేళ్ళ బతుకు, ఆ నిమిషం మళ్ళీరాదు. తరవాత యెందరు స్త్రీలని తెచ్చుకో, ఆ మొదటి స్త్రీ స్పర్శ అంతే. లేచింది, నా బుజంమీద వేళ్ళు అలానే ఉన్నాయి.

"చాకలి వొస్తాడు దీపం పెట్టడానికి. వెళ్ళు" అంది.

"మరి..."

అక్కడ లేదు. లోపలికి వెళ్ళింది. నేను వొచ్చేశాను. అంటే నా గదిలో వున్నాను గనక వొచ్చేశా ననుకున్నాను."

"ఏ 'మరి'...అలానే వుండిపోయింది."

"అంతే. మళ్ళీ పలుకులేదు ఆ పిల్ల నించి. పదిహేను రోజు లయింది. పిలుపడలేదేమో! ఎవరన్నా వొచ్చేరేమోనని. కాని పలక లేదు. కాలేజీలోనన్నా నా వంక కన్నెత్తి చూడలేదు. పది రోజులు చూసి రాత్రులు ఆమె ఇంటిచుట్టూ తిరిగాను. ఏం లాభం? చీటీ రాశాను. జవాబు లేదు. ఎట్లా అందివ్వను చీట్లు నా వంక రానిదానికి? రాత్రులు మాని సాయంత్రాలు ఆ సమయాల్లోనే వెళ్ళాను అటు, ఇంటి వాళ్ళ కళ్ళు తప్పించుకుంటో. బిచ్చగాడ మల్లే చీకట్లో పోదామా? ఇట్లాంటి పన్నాగాలు ఆలోచించాను."

"కావలిస్తే ఆ పిల్లే పిలుస్తుందని యోచించే బుద్ధిలేక పోయింది నీకు."

"అవును. అందువల్ల నే జయం లభించింది. ఆడవాళ్ళ వ్యవ హారాల్లో అట్లాంటి వివేకం వుందా, నోట్లో కరక్కాయే....రాత్రులు ఆ గదిలో చదువుకునేట్టు లేదు. దీపం వుండదు. మరి రాత్రి చాకలి దీపం తెస్తా డంది, మరి ఇప్పుడు యెందుకు ఆ గదిలో రాత్రులు చదువుకోడం మానేసింది? అని కోపం వచ్చింది నాకు. కాని ఆ పిల్లకి నే నొస్తానని భయమన్న స్పష్టమైన సంగతి తెలీలేదు నాకు. స్త్రీ భయపడ్డదా, ఇంక లొంగిపోవడానికి అట్టే శ్రమపడనక్కర్లేదనీ, ఆనాడు తెలీదు. నన్ను తప్పించుకుంటోందని కోపం.

"దాంతో 'డెస్పరేట్' అయినాను. ఓ సాయంత్రం చీకట్లో వెళ్ళి సందులో యెవరూ లేకుండా చూసి తలుపు దబ దబ బాదాను. లోపల్నించి చాకలిగావును 'యెవరు?' అంటూ తలుపు తెరుస్తున్నాడు, పరుగెత్తి వెళ్ళి పోయినాను. నాకు చదువులేదు, యేంలేదు. అదే పని-అదే యోచన. నాలుగు రోజులు ఆగి మళ్ళీ అట్లానే తలుపు కొట్టాను. 'యెవరు?' అంది కోపంతో విశాలాక్షి. ఇంకా గట్టిగా కొట్టాను. కిటికీ దగ్గరికొచ్చి తొంగి చూసింది. నేను కనపడలేదు. చూసి తప్పుకున్నాను. మళ్ళీ తలుపు కొడుతూ, 'నువ్వు తెరిచిందాకా వదలను' అన్నాను. ఆ చప్పుడికి యెదు రింట్లో యెవరన్నా చూస్తారని కూడా ఆలోచించలేదు. లోపలికి తల తీసు కుంది ఇనుపకమ్ములనించి, నిశ్శబ్దం. తలుపు దగ్గిరిగా నుంచుని— "ఎందుకు?" అంది.

"తలుపు తియ్యి చెపుతాను."

"ఇప్పు డెట్లా? నుసుసులు."

"ఎప్పుడు ఐతే?"

"ఇంకో గంటపోయి."

"నిజమా?"

"ఊ....చూడు. గదిలో దీపం కనపడితే తలుపు కొట్టకు. కనపడక పోతే మెల్లిగా కొట్టు. అంత చప్పుడేమిటి?" అంది.

ఆ గంట యెట్లా గడిపాను? అబద్ధమా? మోసంచేస్తుందా? తన్ని స్తుందా? ఈ ఆలోచనలన్నీ రావలసిందే. ఆ వయసులో రావు. అదంతా వయసు ముదిరినాక. గంటకే వెళ్ళానో, ఇంకా ముందుగానో; గదిలో పెద్ద దీపం. కానీ యెవ్వరూ వున్నట్టులేను. మళ్ళీ పోవడం-ఓ గంట జరిగిం దనుకుని ఐదునిమిషాలకే రావడం....అట్లా యెన్నిసార్లో! మరి ఎన్ని గంటలయిందో! దీపం లేదు. నిశిరాత్రిలాగుంది. జనసంచారమే లేదు. ఆ తలుపు అవునో కాదోకూడా తెలీదు. మెల్లిగా చప్పుడు చేశాను. ఏమీ చలనంలేదు. ఇంకొంచెం గట్టిగా. ఉహూ. ఏంచెయ్యను? చూశావా? ఎంత మోసం చేసిందో! కసి ఎక్కువయింది. దీన్ని ఒదలకూడదు. ఇంటికి ఎట్లా వెళ్ళను? ఎట్లా నిద్రపోను? తెగించి ఆ మెట్లమీద కూచున్నాను. ఏం ఆశో తెలీదు. ఎదురుగా రంగులు మారే నక్షత్రం వెలుగుతోంది. కుంటి కుక్క తిండికోసం వెతుక్కుంటోంది. మా అమ్మ చూస్తే ఆ స్థితిలో-అను కున్నాను. ఇట్లా ఏవో అర్థంలేని ఆలోచనలు. కాని యవ్వనం. నిద్రపట్టింది గావును తలుపుమీద ఒరిగాను గావును. రెక్క తెరుచుకుంది. వెనక్కి పడ్డాను. అప్పటికి తెల్లారుతోంది. ద్వాదశినాటి చంద్రవంక ఉదయించింది అని ఈ నాటికీ జ్ఞాపకం. అన్ని గంటలూ తలుపు తెరిచేవుంది. ఉలిక్కి పడ్డాను. రెండునిమిషాలకిగాని జ్ఞాపకం రాలేదు. నిలుచుని మెల్లిగా నడిచాను. ఏం లాభం? ఎవ రుంటారు? మోకాళ్ళకి మంచం కొట్టుకుని కాళ్ళల్లో నరాలు జిల్లుమన్నాయి. మూలిగి మంచంమీద పడ్డాను. కాని విశాలాక్షి మీద....నన్ను గట్టిగా కావిలించుకుని, నామీదికి దొర్లింది...."

"ఊఁ."

"అంతే. ఏం ఊఁ? తెల్లారుతున్నా నన్ను ఒదల్లేదు ఆ పిల్ల. మర్నాడు కూడా నేను రావడానికి ఒప్పించాను చాలా బలవంతంమీద. నాలుగోరోజున నువ్వు నా గది కొచ్చి అర్ధరాత్రిదాకా బాతాఖానీ వేశావు. నాతో నీ విరహం చెప్పుకుంటావు. ఏం చెప్పను నీకు? నిన్ను ఒదిలించు కునేప్పటికి నా పెద్దలు దిగొచ్చారు. ఇంకొంచెం సేపయితే నిన్ను తన్ని గెంటేద్దును. నేను వెళ్ళేప్పటికి....చీకట్లో నా పెదిమలు తగిలేటప్పటికి చెక్కిళ్ళన్నీ తడి.

"ఎందుకు?" అన్నాను ముద్దులతో నింపేస్తో.

"నువ్వు రావేమోనని" అంది దీనంగా.

నిన్ను తిట్టుకున్నాను.

అటు తరవాత నన్ను బతిమాలడం, ప్రతి రాత్రీ రానేమోనని భయాలు. అనవసరంగానే ననుకో. కాని అక్కడ మెత్తదనం కనిపెట్టి దొంగబెట్టు చాలా చేశాను. పరీక్ష చివరిరోజు వరకూ మహారాజులాగ అనుభవించాను చీకట్లో, వెన్నెట్లో."

ఆగాడు రాజయ్య. శ్యామారావు వింటున్నాడనే మరిచిపోయాడు. శ్యామారావు కదల్లేదు. బల్లమీద paper weight (పేపర్ వెయిట్) వంక చూస్తున్నాడు. రాజయ్య మళ్ళీ చెప్పాడు-ఈసారి ఆగుతో నెమ్మదిగా.

"రాత్రి పదకొండింటికి వెళ్ళానా, తెల్లారకట్ట ఐదింటి వరకు ఇద్దరికీ నిద్ర వుండేది కాదు. నెలలో ఇరవై ఆరురోజులూ అదే దీక్ష! పరీక్షలకి ఒకటే చదువుతున్నానని వెక్కిరించేవారు మీ రందరూ, జ్ఞాపక ముందా? పగలు క్లాసులో విశాలాక్షి కునికిపాట్లు పడి చివాట్లు తింటోవుంటే నాకు జాలేసేది. ఆ యేడు యెట్లానూ పరీక్ష తప్పుతుంది. నాలుగు రాత్రులన్నా క్లుప్తంగా పాఠాలన్నీ explain (ఎక్స్‌ప్లెయిన్) చేద్దామను

కున్నాను. ఆ ఉద్దేశ్యంతోనే బయలుదేరేవాణ్ణి. కాని పుస్తకం తెరవక ముందే యెవరో ఒకరం....ఆ పక్క అక్కడ కనపడుతున్నంత సేపూ చదువు ఎట్లా సాగుతుంది మా వెర్రిగాని! అట్లా నెలల తరబడి ప్రతి రాత్రి కొత్తగా రతి సమరానికి తలపడగల ఆడవాళ్ళే కనపడరు. మా పెద్ద అమ్మాయిని మిలిటరీకి వెళ్ళివొచ్చిన అబ్బాయి కిచ్చాము. అంటే కన పడడమూ అట్లానే వుంటాడులే. పెద్ద మీసాలు, రాయివంటి ఛాతీ. రెండు నెలల్లో పీనిగై పుట్టింటికి చెప్పకండా పరిగెత్తుకొచ్చింది, ఎందుకు వొచ్చావే అంటే చెప్పలేదు. వెనకాలే మర్నాటికి మొగుడు సిద్ధం. అతను ఒకటే నవ్వు. 'మీ అమ్మాయి యెందుకు వొచ్చిందో అడగండి' అంటో. నిజంగా అది సమరమే మా మధ్య. విశాలాక్షి రాత్రులు ఓ రాక్షసి అయ్యేది. ఊడి విరబోసిన జుట్టూ, పెద్ద శ్వాసా, తుపానులో అలలమల్లే యెగిరిపడే రొమ్మూ....ఏం ఆడిపోయేది! ఆవేశం పట్టలేక నన్ను కొరికిందంటే, రక్తంతో షర్టు తడిసిపోయేది. ఎక్కడ పడితే అక్కడ ఒళ్ళు తెలీక...."

"ఇంత వ్యవహారం జరుగుతో వుంటే నాకేం తెలీదుకద! వెర్రివాడి మల్లె కలలు కంటున్నాను, పరీక్షలైనాక ఆమెని కలుసుకోవచ్చుననీ, ఆమెనే పెళ్ళి చేసుకుందామనీ, నా మల్లేనే మనసు పెట్టుకుని కూచుందనీ. ఎందుకంటే, మాది ఉత్త స్నేహమనుకోకు. మామధ్య ఏమీ జరక్క పోయినా మా మనసులు మాటలతో కాకుండానే యెన్నో అన్యోన్యాలు కలుపుకున్నాయి. చూపులు మాట్లాడాయి, చాలా వాగ్దానాలు చేశాయి. ఎంత మోసం!"

"ఆమెకి నీమీద గొప్ప ప్రేమ అని చెప్పాను కాదూ?"

"సరేలే. ఆ విశాలాక్షి సరే. ఆమె నాతో మాట్లాడటంలేదనీ, పీలై నప్పుడు కూడా నానించి పెడమొహంపెట్టి తిరుగుతోందనీ, నా భయాలు;

ఆశలు,నిరాశలు, యెన్ని నీతో చెప్పుకునే వాణ్ణి! ఏ మెరగని, ఒకటీ తెలీని నంగనాచిమల్లే యెట్లా వినేవాడివి? పోనీ నాతో...."

"యెలా చెప్పనోయ్? నువ్వే ఆలోచించు."

"అవునులే కానీ, చెప్పు నీ కథ."

"పరీక్షలైనాక వారంరోజులు ఉండిపోయినాను. కాని వెళ్ళక తప్పుతుందా ఇంటికి? ఏం ఏడ్చింది ఆ రాత్రి! ఆ జన్మకీ ముందు జన్మలకీ కూడా వాగ్దాత్తాలు చేసుకున్నాం."

"అలాంటివాళ్ళు పెళ్ళిచేసుకోక పోయినారా?"

"ఈ కాలలో ఐతే అంతే జరిగేది. కాని ఆ కాలంలో ఇంకా భయాలు, కులభేదం, పెద్దవారి అనుజ్ఞలు వగైరా. ఓ రెండేళ్ళలోనే కలుసుకున్నాము మళ్లీ. చక్రపాణి నా మిత్రుడు. మా అత్తవారి వూరు అదే. చూసుకునే వాళ్ళం. కాని నేను నా భార్యతో కొత్త కాపరపు శృంగారం. అదోరకం అనుభవం. అది మన స్వంతం. విశాలాక్షికీ భర్తతో అంతే ననుకుంటా. మా వాగ్దాత్తాలే యెగిరిపోయినాయి గాలిలో. అంతే మన ఉద్దేశ్యాలూ, వాంఛలూ. చక్రపాణి చచ్చిపోయినప్పుడు, ఆ వూళ్ళోనే వున్నాను. అతాత్తుగా గుండె ఆగి, పోయినాడు. ఇంకా బంధువు లెవరూ రాలేదు. దహనం చేయించి రాత్రి యెనిమిదింటికి వాళ్ళ యింటికే వొచ్చాను. తల్లీ కూతురే యింట్లో. నన్ను వెళ్ళవొద్దంది. వుండి పోయినాను. రాత్రి నిద్రపోతో వుంటే ఏడుపు వినిపించింది. ఆ ఏడుపులు నాకు చాలా చిరాకు, అసహ్యం. నేనే ఈ దేశానికి డిక్టేటర్‌ని అయితే, చచ్చినప్పుడు ఏడవకూడదని మొదట శాసనం చేస్తాను.

నన్ను చూడగానే విశాలాక్షి "ఇక నాకు దిక్కెవరు?" అని బిగ్గరగా ఏడ్చింది.

"నేను వున్నాను, నిజం. నమ్ము" అన్నానో లేదో ఆనాటి రాత్రి వాగ్దత్తాలు జ్ఞాపకం ఒచ్చాయి.

"నువ్వా! నీ సంసారం, పిల్లలూ, పనీ...."

"ఆ రాత్రి మన ప్రమాణాలు...."

ఏడుపు మాని నావంక చూసింది. చిన్న చిరునవ్వు.

"ఇంకా జ్ఞాపకం వుందా?"

"ఏం? నువ్వు మరిచిపోయినావా?"

"లేదు. కాని, చిన్ననాటి మాటలు."

"అందుకనే అంతబలం వీ! ఏమీ భయపడకు."

ఆ 'వీ', అది పూర్వం పిలిచేవాణ్ణి విశాలాక్షిని. ఆ మాట విని కంపించిపోయింది.

"ఆయనకి అన్నీ అప్పులు...."

"కానీ. నే నున్నాను."

"నిజమా?" అని నా చెయ్యి పట్టుకుంది. నేను ఆమె కన్నీళ్ళని తుడిచి ఓదార్చాను. తరవాత .... మళ్లీ మొదలు - అక్కడే ఆ చాప మీదనే...ఏమిటి అట్లా చూస్తావు? ఏమీ చిత్రం కాదు. ఇట్లాంటి వ్యవహారాలు చాలా వరకు, భార్య నొప్పులు పడేప్పుడూ, భర్త చావులోనూ ప్రారంభ మౌతాయి. అప్పుడు హృదయం అసహాయ స్థితిలో వుంటుంది గావును, ఏది దొరికినా ఆధారంగా పట్టుకుంటుంది."

"తరవాత?" అన్నాడు గాని శ్యామారావు, అతని మనసు ఎక్కడో ఉన్నట్టుంది.

"ఊం."

"అంతే. ఏం ఊం? తెల్లారుతున్నా నన్ను ఒదల్లేదు ఆ పిల్ల. మర్నాడు కూడా నేను రావడానికి ఒప్పించాను చాలా బలవంతంమీద. నాలుగోరోజున నువ్వు నా గది కొచ్చి అర్ధరాత్రిదాకా బాతాఖానీ వేశావు. నాతో నీ విరహం చెప్పుకుంటావు. ఏం చెప్పను నీకు? నిన్ను ఒదిలించు కునేప్పటికి నా పెద్దలు దిగొచ్చారు. ఇంకొంచెం సేపయితే నిన్ను తన్ని గెంటేద్దును. నేను వెళ్ళేప్పటికి....చీకట్లో నా పెదిమలు తగిలేటప్పటికి చెక్కిళ్ళన్నీ తడి.

"ఎందుకు?" అన్నాను ముద్దులతో నింపేస్తో.

"నువ్వు రావేమోనని" అంది దీనంగా.

నిన్ను తిట్టుకున్నాను.

అటు తరవాత నన్ను బతిమాలడం, ప్రతి రాత్రీ రానేమోనని భయాలు. అనవసరంగానే ననుకో. కాని అక్కడ మెత్తదనం కనిపెట్టి దొంగబెట్టు చాలా చేశాను. పరీక్ష చివరిరోజు వరకూ మహారాజులాగ అనుభవించాను చీకట్లో, వెన్నెట్లో."

ఆగాడు రాజయ్య. శ్యామారావు వింటున్నాడనే మరిచిపోయాడు. శ్యామారావు కదల్లేదు. బల్లమీద paper weight (పేపర్ వెయిట్) వంక చూస్తున్నాడు. రాజయ్య మళ్ళీ చెప్పాడు-ఈసారి ఆగుతో నెమ్మదిగా.

"రాత్రి పదకొండింటికి వెళ్ళానా, తెల్లారకట్ట ఐదింటి వరకు ఇద్దరికీ నిద్ర వుండేది కాదు. నెలలో ఇరవై ఆరురోజులూ అదే దీక్ష! పరీక్షలకి ఒకటే చదువుతున్నానని వెక్కిరించేవారు మీ రందరూ, జ్ఞాపక ముందా? పగలు క్లాసులో విశాలాక్షి కునికిపాట్లు పడి చివాట్లు తింటోవుంటే నాకు జాలేసేది. ఆ యేడు యెట్లానూ పరీక్ష తప్పుతుంది. నాలుగు రాత్రులన్నా క్లుప్తంగా పాఠాలన్నీ explain (ఎక్స్‌ప్లెయిన్) చేద్దామను

కున్నాను. ఆ ఉద్దేశ్యంతోనే బయలుదేరేవాణ్ణి. కాని పుస్తకం తెరవక ముందే యెవరో ఒకరం....ఆ పక్క అక్కడ కనపడుతున్నంతసేపూ చదువు ఎట్లా సాగుతుంది మా వెర్రిగాని! అట్లా నెలల తరబడి ప్రతి రాత్రీ కొత్తగా రతి సమరానికి తలపడగల ఆడవాళ్ళే కనపడరు. మా పెద్ద అమ్మాయిని మిలిటరీకి వెళ్ళివొచ్చిన అబ్బాయి కిచ్చాము. అంటే కన పడడమూ అట్లానే వుంటాడులే. పెద్ద మీసాలు, రాయివంటి ఛాతీ. రెండు నెలల్లో పిన్నిగై పుట్టింటికి చెప్పకండా పరిగెత్తుకొచ్చింది, ఎందుకు వొచ్చావే అంటే చెప్పలేదు. వెనకాలే మర్నాటికి మొగుడు సిద్ధం. అతను ఒకటే నవ్వు. 'మీ అమ్మాయి యెందుకు వొచ్చిందో అడగండి' అంటో. నిజంగా అది సమరమే మా మధ్య. విశాలాక్షి రాత్రులు ఓ రాక్షసి అయ్యేది. ఊడి విరబోసిన జుట్టూ, పెద్ద శ్వాసా, తుపానులో అలలమల్లే యెగిరిపడే రొమ్మూ....ఏం ఆడిపోయేది! ఆవేశం పట్టలేక నన్ను కొరికిందంటే, రక్తంతో షర్టు తడిసిపోయేది. ఎక్కడ పడితే అక్కడ ఒళ్ళు తెలీక...."

"ఇంత వ్యవహారం జరుగుతో వుంటే నాకేం తెలీదుకద! వెర్రివాడి మల్లె కలలు కంటున్నాను, పరీక్షలైనాక ఆమెని కలుసుకోవచ్చుననీ, ఆమెనే పెళ్ళి చేసుకుందామనీ, నా మల్లేనే మనసు పెట్టుకుని కూచుందనీ. ఎందుకంటే, మాది ఉత్త స్నేహమనుకోకు. మామధ్య ఏమీ జరక్క పోయినా మా మనసులు మాటలతో కాకుండానే యెన్నో అన్యోన్యాలు కలుపుకున్నాయి. చూపులు మాట్లాడాయి, చాలా వాగ్దానాలు చేశాయి. ఎంత మోసం!"

"ఆమెకి నీమీద గొప్ప ప్రేమ అని చెప్పాను కాదూ?"

"సరేలే. ఆ విశాలాక్షి సరే. ఆమె నాతో మాట్లాడటంలేదనీ, వీలై నప్పుడు కూడా నానించి పెడమొహంపెట్టి తిరుగుతోందనీ, నా భయాలు,

ఆశలు,నిరాశలు, యెన్ని నీతో చెప్పుకునే వాణ్ణి! ఏ మెరగని, ఒకటీ తెలీని నంగనాచిమల్లే యెట్లా వినేవాడివి? పోనీ నాతో...."

"యెలా చెప్పనోయ్? నువ్వే ఆలోచించు."

"అవునులే కానీ, చెప్పు నీ కథ."

"పరీక్షలైనాక వారంరోజులు ఉండిపోయినాను. కాని వెళ్ళక తప్పుతుందా ఇంటికి? ఏం ఏడ్చింది ఆ రాత్రి! ఆ జన్మకీ ముందు జన్మలకీ కూడా వాగ్దానాలు చేసుకున్నాం."

"అలాంటివాళ్ళు పెళ్ళిచేసుకోక పోయినారా?"

"ఈ కాలలో ఐతే అంతే జరిగేది. కాని ఆ కాలంలో ఇంకా భయాలు, కులభేదం, పెద్దవారి అనుజ్ఞలు వగైరా. ఓ రెండేళ్ళలోనే కలుసుకున్నాము మళ్ళీ. చక్రపాణి నా మిత్రుడు. మా అత్తవారి వూరు అదే. చూసుకునే వాళ్ళం. కాని నేను నా భార్యతో కొత్త కాపరపు శృంగారం. అదోరకం అనుభవం. అది మన స్వంతం. విశాలాక్షికీ భర్తతో అంతే ననుకుంటా. మా వాగ్దానాలే యెగిరిపోయినాయి గాలిలో. అంతే మన ఉద్దేశ్యాలూ, వాంఛలూ. చక్రపాణి చచ్చిపోయినప్పుడు, ఆ వూళ్ళోనే వున్నాను. అకాత్తుగా గుండె ఆగి, పోయినాడు. ఇంకా బంధువు లెవరూ రాలేదు. దహనం చేయించి రాత్రి యెనిమిదింటికి వాళ్ళ యింటికే వొచ్చాను. తల్లీ కూతురే యింట్లో. నన్ను వెళ్ళవొద్దంది. వుండి పోయినాను. రాత్రి నిద్రపోతో వుంటే ఏడుపు వినిపించింది. ఆ ఏడుపులు నాకు చాలా చిరాకు, అసహ్యం. నేనే ఈ దేశానికి డిక్టేటర్‌ని అయితే, చచ్చినప్పుడు ఏడవకూడదని మొదట శాసనం చేస్తాను.

నన్ను చూడగానే విశాలాక్షి "ఇక నాకు దిక్కెవరు?" అని బిగ్గరగా ఏడ్చింది.

"నేను వున్నాను, నిజం. నమ్ము" అన్నానో లేదో ఆనాటి రాత్రి వాగ్దత్తాలు జ్ఞాపకం ఒచ్చాయి.

"నువ్వా! నీ సంసారం, పిల్లలూ, పనీ...."

"ఆ రాత్రి మన ప్రమాణాలు...."

ఏడుపు మాని నావంక చూసింది. చిన్న చిరునవ్వు.

"ఇంకా జ్ఞాపకం వుందా?"

"ఏం? నువ్వు మరిచిపోయినావా?"

"లేదు. కాని, చిన్ననాటి మాటలు."

"అందుకనే అంతబలం వీ! ఏమీ భయపడకు."

ఆ 'వీ', అది పూర్వం పిలిచేవాణ్ణి విశాలాక్షిని. ఆ మాట విని కంపించిపోయింది.

"ఆయనకి అన్నీ అప్పులు...."

"కానీ. నే నున్నాను."

"నిజమా?" అని నా చెయ్యి పట్టుకుంది. నేను ఆమె కన్నీళ్ళని తుడిచి ఓదార్చాను. తరవాత .... మళ్ళీ మొదలు - అక్కడే ఆ చాప మీదనే...ఏమిటి అట్లా చూస్తావు? ఏమీ చిత్రం కాదు. ఇట్లాంటి వ్యవహారాలు చాలా వరకు, భార్య నొప్పులు పడేప్పుడూ, భర్త చావులోనూ ప్రారంభ మౌతాయి. అప్పుడు హృదయం అసహాయ స్థితిలో వుంటుంది గావును, ఏది దొరికినా ఆధారంగా పట్టుకుంటుంది."

"తరవాత?" అన్నాడు గాని శ్యామారావు, అతని మనసు ఎక్కడో ఉన్నట్టుంది.

"అంతే. ఆమెకి భక్తి వైరాగ్యాలు ఎక్కువై, తన పాత జీవితంలో చేసిన పాపానికి-అంటే నాతో కలిసి-పశ్చాత్తాపంతో యాత్రలు పైలుచేరిందాకా, కోర్టు వ్యవహారాల మూలాన ఆమె మా యింటికి తరచూ వొచ్చేది. చివరికి హఠాత్తుగా నాకు వొదిలి వెళ్ళింది రామేశ్వరం. అప్పటికి నాకూ ఆమె మీద పట్టు చల్లబడ్డది" అని ఇంకేం చెప్పటానికి లేక ఆగాడు రాజయ్య. శ్యామారావు వంక చూశాడు. ఎంతసేపయిందో అతను తన ఆలోచనల్లోనే వుండిపోయి నట్టున్నాడు. చివరిదాకా విన్నాడో-లేదో.

ఎంత పొద్దుపోయిందో! కిటికీలోంచి వెన్నెల తివాసీ మీద నుంచి వాళ్ళ పాదాలదాకా పాకింది. రోడ్డు మీదనుంచి కూడా ఏమీ చప్పుడు లేదు. ఆ నిశ్శబ్దంలో ఏదవాలో పుస్తకాలూ గోడలూ మాట్లాడ్డం ప్రారంభించా యనిపించింది. ఎంతసేపు కూచున్నారో అట్లా మాట్లాడకుండా. శ్యామారావుకి తనమీద చాలా కోపం, అసూయా, అసహ్యం కలిగాయి కావు నను కున్నాడు రాజయ్య. త్వరలోనే, పాత స్మరణలలో అతనికి అశాంతి కలిగి లేచి వెళ్ళి కిటికీ వద్దర నుంచున్నాడు చుట్ట వెలిగించాలని అనుకుంటో. ఒక తెల్లని మబ్బు చంద్రుడ్ని సమీపిస్తోంది. ఎంత ఒంటరిగా వుంటాడో చంద్రుడు నిశిరాత్రి! యవ్వనంలో తమకోసం వెలుగుతో, తమ రసికత్వా లకి మెరుగు పెట్టిన మిత్రుడు? ఇప్పుడు? చాలా ఒంటరి అనిపించింది జీవితం. వృద్ధాప్యం మొదలా! నిద్ర వొస్తోంది. కదలలేదు శ్యామారావు.

"On such a night as this" (ఆన్ సచ్ ఎ నైట్ ఆజ్ దిస్) అన్నాడు రాజయ్య, ఆ నిశ్శబ్దాన్ని భరించలేక.

# ఆరంభింపరు....

శంకర్ చాలా ఆంబిషన్ గల యువకుడు. యం. యస్. సి. ఐనాడు. కాని వుద్యోగాలు లేవు. జర్నలిజంలో వినుతి కెక్కాలని అతని ఆదర్శం. భార్యని కాపరం చేయించమని తొందర చేస్తున్నారు అత్తవారు. తప్పదు. ఏదో ఓ ఉద్యోగంలో ప్రవేశించాలి. కాపరానికి డబ్బు అనేది అంత అవసరమైన విషయం యెందుకు కావాలా అని తర్కించుకుంటో వుంటాడు, అతని ముందు వరండాలో గింజల్ని ఏరుకుని యెగిరే పిచిక జంటవంక చూస్తో.

కేర్ ఆఫ్ హిందూ ప్రకటన చూసి దరఖాస్తు చేశాడు. ఎవరికో ప్రైవేటు సెక్రటరీ కావాలిట. ఇన్‌టర్వ్యూకి రమ్మని ఉత్తరం ఒచ్చింది. యోగ్యతల్ని పట్టి జీతం నిర్ణయిస్తుందిట ఆమె. కవయిత్రి కారణ్ అనే పేరు చూసేప్పటికి అతని మనసు జలదరించింది. తనకే ఆ ఉద్యోగం దొరికితేనా? కవయిత్రి, సుప్రసిద్ధ ప్రచారకురాలు, విద్యావతి, రూపవతి, యవ్వనవతి, స్వతంత్ర సమరవతి, దేశభక్తియుత ఉత్సాహవతి. ఆమెని దేశమంతటా ప్రతిసభలో ఉపన్యసించడానికీ, ప్రజల్ని యిన్‌స్పయర్ చెయ్యడానికి ఆహ్వానిస్తో వుంటారు. పత్రికల్లో ఆమె ఉపన్యాసాలు పెద్ద పెద్ద అక్షరాలతో ప్రకటిస్తో వుంటారు. పత్రికలకి రాస్తుందికూడాను. ఆమె భర్త కాంగ్రెసు ఉద్యమంలో జైళ్ళకి పెళ్ళి ఆరోగ్యం పాడై చచ్చిపోయి నాడు. అతని త్యాగం కూడా ఈమె నామధేయానికి ప్రకాశాన్నిస్తోంది. ఆమె సెక్రటరీకి పని భారంగానే వుంటుంది. కాని ఆమె మాటని దేశంలో శిరసావహించని నాయకుడు లేడు. ఇంగ్లీషు గవర్నర్లు కూడా ఆమె!

ఇన్ టర్ వ్యూ లిస్తారు, జైలులో తొయ్యనప్పుడు. ఆమె ద్వారా దేశంలో యెవరితో పరిచయం కాదు తనకి? సరిగా తనకి కావలసిన ఉద్యోగం. తన జాతకం యెంతవరకు సాగించ బోతోందో! ప్రకటనలో బాగా కష్టపడి పని చేయగల యువకులు మాత్రమే దరఖాస్తు పెట్టాలని వుంది. తన యావ చ్ఛక్తిని వినియోగించి ఐనా ఆమె అనుగ్రహం సంపాయించాలి.

ప్రయాణం ఖర్చులకి అప్పుచేసి వెళ్ళాడు ఇన్ టర్ వ్యూకి. మద్రాసు సబర్బ్స్‌లో పెద్ద తోట. పురాతన వృక్షాలకింద నడుస్తో మంచి బంగాళా చేరాడు. నాలుగైదు కార్లు ఉన్నాయి వైట. జవాను అతను వచ్చిన పని అడిగి పక్కగదిలోకి తీసికెళ్లాడు అతన్ని. వరండాలో ఇంకా అయిదారుగురు యువకులు కూచుని వున్నారు. ఇద్దరు ముగ్గురితో ఇన్ టర్ వ్యూ అప్పుడే ఐనట్టుంది.

ఎదురుగా హాలులో కబుర్లు చెప్పుకుంటో కూచున్న పెద్దమనుషుల వంక చూస్తో పెద్ద గదిలో అర్ధచంద్రాకారం టేబిల్ ముందు సింహాసనం వంటి దిళ్ళ కుర్చీలో కూచుని వుంది ఆమె. ఆమె చీరె, జాకెట్, పారిస్ నించి వొచ్చిన అతి విలువగల బట్టలు. అక్కడే చేసిన రవ్వల నాజూకు నగలు. ఉదయకాంతి కిటికీలోంచి కొంచెంగా యెదర గోడమీద పడి ప్రతి ఫలించి ఆమెని వెలిగిస్తోంది. రెండు పక్కలా పుస్తకాల వరసలు. బల్లమీద కాయితాలు, పెన్నులు అన్నీ నవీన ఆఫీసు పరికరాలు. దూరంగా కిటికీ దగ్గిర టైపు చేస్తో ఒక అతను.

ఆమె శంకర్ని కూచోమనలేదు. అతని యోగ్యతల్నీ అనుభవాన్నీ ప్రశ్నిస్తో, నిర్భయంగా, చాలా తక్కువ మనిషిని చూస్తున్నట్టు యెగా దిగా చూసింది. అతని దరఖాస్తు మీద గావును ఏదో రాసుకుంది.

"ఈ రెండేళ్ళూ ఏం వుద్యోగం యెందుకు చెయ్యలేదూ?"

"దొరక్క."

"ఎక్కడ దొరుకుతుంది? రోడ్ల మీదా? పడక గదిలోనా?"

వెక్కిరింపు. ఉద్యోగం అంత అవసరం కాకపోతే జవాబు చెప్పను శంకర్రావు. వూరుకున్నాడు.

"ఏం ప్రయత్నం చేశావు?"

"ప్రయత్నం చెయ్యవలసినచోటే కనపళ్ళేదు."

"ఎట్లా కనపడుతుంది, తండ్రి పెడుతో వుంటే తినే యువకులికి? మీవంటి వారి మూలానే దేశం అంత అధ్వాన్నంగా తగల పడుతోంది."

"ఉద్యోగం ఇస్తే రోజుకి ఎన్ని గంటలు పని చెయ్యగలవు"?

"అవసరమైనంత వరకు."

"ఎవరి అవసరం?"

"ఉద్యోగం అవసరం."

"ఏమిటా నుంచోడం? అందుకనే యువకులందరికీ సైనిక శిక్షణ ఇవ్వాలని సలహా చేస్తున్నాను. స్వతంత్రమంటే సోమరితనం అని అర్థం యువకులకి. అధికారుల్ని యెదిరించడం. మీ కాలేజీలో అదేగా మీరు నేర్చుకుంటోంది?—

ఏయి రామన్! (టైపిస్టుని) ఏమిటా దిక్కులు చూడడం, కానీ తొరగా-

"స్వతంత్రమంటే కృషి, కృషి. నడుములు వొంచి పని చెయ్యడం రాత్రులు-పగలు. నేను చూడు, యెన్నిగంటలు పనిచేస్తానో తెలుసా?"

అందుకనే అన్ని వజ్రాల నగలు అనుకున్నాడు.

కాఫీ తెచ్చాడు బట్లరు.

"మరిచిపోయినావు మళ్ళీ-కొత్తవాడు లెండి యీ బట్లరు. ఆ తలుపు మీద కొట్టి నేను రమ్మంటేనే గాని రాకూడదు. జీతాలు హెచ్చించాలి. లాభాలు పంచాలి. కాని పని మాత్రం సరిగా చెయ్యాలనే ధ్యాస లేదు. సరే పో-సరే లెండి, మీరు ఇక వెళ్ళండి."

"మా వూరు వెళ్ళనా?"

"మీ పేరుగాక ఎవరి పేరు పెడతారు?"

"ఏం? వాళ్ళందరూ నీ కన్న తీసిపోయినారా? ఆలోచిస్తాను."

"ఎన్నాళ్ళల్లో తెలుస్తుంది?"

"ఏమిటా తొందర? మీ ముఖారవిందం చూడగానే, ఇంతకన్న ఇంకేం కావాలని, వెంటనే ఉద్యోగం ఇచ్చేస్తారని ఆశతో వచ్చినట్టుంది!"

అతను సిగ్గుపడుతో ఉద్యోగం ఇచ్చినా సరే, తనకి అఖ్ఖర్లేదను కుంటూ బయటికి వచ్చాడు. అసలు ఆ మాటలుగాక, స్త్రీచేత ఆ మాట లనిపించుకుని జవాబు చెప్పలేక పోవడం చాలా అతని అభిమానానికి గాయ మయింది.

వరండా మెట్లు దిగుతో వుంటే—

'సర్' అన్నాడు వెనకాలే వచ్చి బట్లరు.

"ఇట్లా దయచెయ్యండి."

ఇంటి వెనుక పెద్ద గదిలోకి తీసికెళ్ళాడు. ఇంతకు 'ముందు ఇన్‌టర్‌వ్యూ అయినవాళ్ళు ముగ్గురు అక్కడ కాఫీ తాగుతున్నారు. అతన్ని చూచో మన్నారు.

చాలా అందమైన గది. టేబిల్, అన్నీ వెండి సెట్లు. ఇడ్లీ దోసెలు, ఉప్మా, జిలేబీ, కాఫీ, టీ.

కావలసిన వాళ్ళకి ఆమ్లెట్లు ఇస్తా నన్నాడు బట్లర్. వాళ్ళు అతనితో మాట్లాడలేదు. తెలుగు వాళ్ళ లాగు లేరు. 'వాళ్ళ మాటలూ వినపడలేదు, గొంతెత్తి మాట్లాడ్డం భయంగా వుంది. అదేం మర్యాద! ఉద్యోగానికి వచ్చిన వాళ్ళకి యీ ఫలహారం. వెళ్ళేప్పుడు అతని చేతిలో కవరు పెట్టాడు యింకో నౌకరు. రైలు ఖర్చులు అని రాసివుంది.

ఆ పెద్ద చెట్లకిందనించి నడుస్తో, ఆమెదగ్గర ఉద్యోగం కావడం కన్న ఇంకేం అదృష్టం వుంటుంది అనుకున్నాడు.

గేటు దగ్గర అతనికోసం ఒకతను చూస్తున్నాడు.

"శంకర్!"

"నన్నెట్లా ఎరుగుదువు?"

"నేను నీ జ్ఞాతిని. నువ్వు నన్నెరగవు" అని బంధుత్వం తెలిపాడు.

పాపం, ఆ యువకుడు చాలా పాలిపోయి క్షీణించి వున్నాడు. కాని ఉత్సాహం అతనిలో పోలేదు.

"ఏం చేస్తున్నావు ఇక్కడ?"

"నే నామెకి సెక్రెటరీ."

"నువ్వా!"

"నా స్థానాన్నే మీకు ఇన్‌టర్‌వ్యూలు. తప్పుకుంటున్నాను."

"చాలా చిత్రమైన మనిషి లాగుందే!"

యువకుడు వాచి చూసుకుంటున్నాడు.

"చాలా. కాని ఇది విను. నేను వెళ్ళాలి. ఆలస్యమైతే చంపేస్తుంది."

"సరేలే. చాలా ఎక్కువ పనా?"

"అబ్బే!"

"నువ్వెందుకు మానేస్తున్నావు?"

"అనారోగ్యం."

"ఓ-పాపం! ఏమిటి?"

"వాటన్నింటికీ వ్యవధి లేదు. చూడు, నీకు ఉద్యోగం ఇస్తానన్నా తీసుకోకు."

"ఏమి?"

"ఏం లేదు, అంతే!" అని వెళ్ళిపోతున్నాడు.

"పోనీలే, ఏం పోయింది! కష్టంగా వుంటే అప్పుడే మానేస్తాను."

"మానెయ్యలేవు, అదే వొచ్చిన కష్టం."

"సరేలే. మరి నువ్వు ఎందుకు అంత జబ్బుగా...."

"అదే. అదే. ఒప్పుకోకు."

"పోనీ ఉత్తరం రాస్తావా?" అన్నాడు వెంటబడి.

"ఎందుకు ఉత్తరం!"

"ఇక్కడి సంగతులు."

"అమ్మో! ఉత్తరమే! నేనేం రాయను, చెప్పను. ఉద్యోగం ఒప్పుకోకు. ఒప్పుకుంటే నా మల్లేనే ఐపోతావు. ఆమె చూస్తుంది. వెళ్ళిపో!" అంటో పరిగెత్తాడు.

నాలుగో రోజుకి శంకర్‌కి ఉద్యోగం ఆర్డరు వొచ్చింది.

నెలకి రు. 150 జీతం. ఆమెతో తిరుగుతో వుండాలి. ఇన్‌టర్ ఛార్జీలు. రోజుకి మూడు రూపాయల భత్యం. కాని ఆమె కుటుంబంలోనే వుండవొచ్చు సంసారం లేకపోతే. అట్లా ఐతే రోజు భత్యం వుండదు.

ఆలోచించాడు. తన జ్ఞాతి చెప్పిన భయాలు తోసేసుకున్నాడు. రు. 150 జీతం. ఈ జన్మకి తనకి యెక్కడ దొరుకుతుంది అట్లాంటి ఉద్యోగం? చివాట్లా? యెక్కడ తప్పుతాయి నౌకరీ అన్న తరవాత? మరి యెందుకు బెదిరించాడు తనని? ఏం? అంత బావుండకపోతే యెందుకు మానెయ్య కూడదు? పైగా ఆ హర్మ్యంలో వుండ వొచ్చుట. అదిగాక యెప్పుడూ ప్రచారమే ఐతే ఈ సంసారాన్ని ఎక్కడ పెడతాడు?

పాత ట్రంకు సద్దుకుని, చిరుగు జంపఖానా, మాసిన దిండు చుట్టుకుని బైలుదేరాడు ఆ రాత్రికే! వొస్తున్నానని టెలిగ్రాం ఇచ్చి, రైలు స్టేషనులో ఆగింది. రైలు దిగి పెట్టా ట్రంకూ పట్టుకుని బస్సుకోసం నడుస్తున్నాడు. వెనకాలే వొచ్చి అతని సామాను తీసుకున్నాడు ఒక లీవరీడ్ షాఫరు. కారులో కూచోపెట్టి తీసుకు పోయినాడు.

ఆమె బంగళాలో ఓ పక్క గదిలోకి తీసికెళ్ళి ప్రవేశపెట్టాడు. వెంటనే కాఫీకి పిలిచారు. భోజనాల గదిలో ఆమె కాఫీ తాగుతోంది.

అతన్ని చూడగానే ఆమె నమస్కారం పెట్టింది. చాలా ఆదరంగా చిరునవ్వుతో కూచో పెట్టింది.

ప్రయాణం, ఇంటి దగ్గర వాళ్ళ యోగ క్షేమాలు అడిగింది. స్వయంగా అతనికి వొడ్డింప చేసింది అతని రుచులన్నీ తెలుసుకుంటో.

పూరి పెలపల బైరాగి వాడి మెళ్ళో ఏనుగు పూల హారం వేసి తొండంతో పైకెత్తి అంబారీ మీద కూచో పెట్టుకుంటున్నట్టు వుంది అతనికి. ఇంకో నలుగురు కాపీ తాగుతున్నారు ఆ బల్ల దగ్గిరే.

"అబ్బా! ఆ బట్టలు విప్పకుండానే వొచ్చారా? ఏం చేస్తున్నాడు గోరాకుంభర్?"— అంటే వాటో చాకలి నౌకరు.

"మీ వూళ్ళో అంతే గావును! ఎట్లా తిరుగుతారు తెలుగువాళ్ళ? ఒంటిమీద జాగ్రత్త లేనివాళ్ళకి పనిమీద ఏముంటుంది?" అంది వెక్కిరింపుగా.

తల వొంచుకుని పోయింది అతనికి.

"ఏమిటా సిగ్గు? మొగాడివి కాదుటయ్యా! సరిగా చూడు. అదుగో, ఆ దోసె పారెయ్యడమేనా? అవాయిడ్ వేస్ట్. ఇండియా బీద దేశం."

"ఆ సంగతి ఈ ఇంటికి అరమైలు దూరంలో జ్ఞాపకంరాదు" అన్నాడు సహించలేక.

చాలా హాయిగా నవ్వింది, ఆ మాటని కాంప్లిమెంటు కింద తీసుకుని. ఆమెకి మెదడు తక్కువా? లేక అది చాలా నేర్పైన ఒడుపా?

"అవును. తినాలి. అనుభవించాలి. నాజూకుగా కోడిమల్లే తిండిని పొడుచుకుతినే వాళ్ళని చూస్తే అసహ్యం నాకు."

అతను గదిలోకి వెళ్ళాడు. క్రొత్త ట్రంకు ఎవరివో పెట్టారు. ఎంతమంది సెక్రటరీలు ఈమెకి! అప్పుడే సామాను కూడా అమర్చుకున్నాడు బల్లమీద. తళ తళ లాడే కొత్త షేవింగు సెట్. తల నూనె, దువ్వెనలు, అన్నీ.

గోరాకుంభర్ వొచ్చి స్నానానికి పిలిచాడు.

"నా బట్టలు?"

"ఆ పెట్టెలో వున్నాయి."

" నా పెట్టె?"

"పారేశాం."

మంచం, దాని మీద పక్క, తెల్లని దుప్పటి.

పైన ఫాన్.

"నా పక్క చుట్ట?"

"పారేశాం. షేవ్ చేసుకోండి. అవుగో."

"ఇవన్నీ నాకే?"

"ఆ."

క్షౌరం, స్నానం, బట్టలు, అన్నీ కాగానే, పిలుపు వొచ్చింది. మళ్ళీ ఆమె ఆఫీసుగది. చీరెలు, నగలు అన్నీ మారిపోయినాయి. ఇంకో రంగులు, ఫాషన్‌లు. కూచోమంది ఈసారి. ఆ టైపిస్టు అట్లాగే వున్నాడు.

ఓ ఉత్తరాల కట్ట ఇచ్చి జవాబులు రాయమంది. ఏం రాయాలో ప్రతి ఉత్తరం మీదా పొడి మాటలలో రాసి వుంచింది అంతకుముందే.

"అవి సరిగా రాసి నాకు చూపండి. తరవాత ఫెయిర్ కాపీ చేద్దురుగాని, అతను టైపు చేస్తాడు. రెండురోజుల్లో గో రక్షణమీద పావు గంట ఉపన్యాసానికి నోట్సు తయారు చెయ్యండి రేడియోకి. లైబ్రరీ చూపిస్తారు. మీకు కావలసిన ఇన్‌ఫర్‌మేషన్ అక్కడ దొరుకుతుంది" అంది.

మళ్ళీ భోజనం ఆమెతోనే. ఆ టైపిస్టు కూడా. ఎవరో ఇద్దరు కొత్త అతిథు లున్నారు. ఆమె ఒకటే మాట్లాడుతోంది. కాని ఎవరూ

గట్టిగా ఎదురు చెప్పడానికి వీల్లేదు, చెప్పనీదు. ఎక్కిరింపుతో, లేక ఉపేక్షతో నోరు మూస్తుంది. తనైతే నౌకరు. వాళ్ళెందుకు లొంగిపోతారో అతనికి అర్థం కాలేదు. ఆమె ధారమో లేక పర్సనాలిటీయో అనుకున్నాడు. ఏ పని గాని ఆ ఇంటో చాలా నిక్కచ్చిగా జరగాలి. అందుకని తన కోసం, తన అతిథుల కోసం, సెక్రటరీల కోసం, అరుస్తో వుంటుంది. ఆమెకి స్నేహితురాళ్ళే గాని బంధువులు ఎవరూ లేనట్టుంది· ఉంటే చేర నియ్యదో.

మధ్యాహ్నం నించి టైలరు ఒచ్చి అతని కొలతలు తీసుకున్నాడు. మర్నాడు స్నానం చేసి ఒచ్చేప్పటికి అతని బల్లమేద రిస్టువాచి, ఖరీదైన కలం. పెట్టెలో బట్టలు తనవి కావు. సేలం అంచు పంచలు, సిల్కు లాల్చీలు, జరీ గోరంచు కండువాలు. అన్నీ ఒకే రకం. ఇదేం దయా! ఈ బలవంతం?

కాని డ్రెస్ చేసుకుని చూసుకుంటే, తన ఒంటి తీరుకి, ముఖానికీ సరిగా ఎటువంటివి సరిపోతాయో, ఏవి స్టేటస్‌నీ, అందాన్నీ, చిక్‌నీ ఇస్తాయో సరిగా ఆ బట్టలు అవి.

రాత్రి భోజనం దగ్గర థాంక్ చేశాడు ఆమెని. "ఎందుకు థాంక్సు? నీ కోస మనుకున్నావా ఏం! నా సెక్రటరి కోసం. నా సెక్రటరీని చూసి నా మీద గౌరవం రావాలి."

అంతే తనకి లివరీ అన్నమాట-కారు షాఫర్కిమల్లే.

ఆమె లైబ్రరీ చాలా గొప్పది. ఎన్ని నవలలు, చరిత్రలు, కవిత్వాలు! పైగా బట్టలు లేని బొమ్మల పుస్తకాలు! ఎంత ఖరీదో అవి!

ఆ టైపిస్టు తనని కలుసుకోడు, ఎప్పుడోతప్ప. "ఎంత వైభవం! ఏమిటి ఇంత సంపద?" అన్నాడు శంకర్.

"ఆమె కేం? భర్త నాలుగు లక్షలు వొదిలాట్ట. పైగా బోలెడు సంపాదన, అనుభవిస్తోంది హాయిగా."

ఆ రాత్రి రాజకుమారుడి మళ్లే పడుకున్నాడు, కిటికీ లోంచి తోటలో షాంపైన్ నీళ్ళలోంచి మెరిసే వెన్నెల వంక చూస్తూ. ఆస్ట్రేలియన్ శీకాయ, కస్తూరి, తుమ్మపూల పరిమళాల్ని అనుభవిస్తూ.

తెల్లారిందంటే—

వూరికే అట్లా తెల్లారిందంటే బాగాలేదా? ఇదేం చలం కథ అనుకున్నారా?

మర్నాటి నించి అతన్ని ఆమె పనులు చెప్పి వూళ్ళోకి పంపుతోంది. మినిస్టర్లు, రేడియోవారు, పత్రికాధిపతులు, రాజ్యాంగ సభ్యులు, ఒక రేమిటి?

"ఎక్కడికి వెళ్ళినా కారులో వెళ్ళండి."

"కారెందుకు?"

"మీ కోసమా! పని కావడం ప్రధానం. నువ్వూ కాదు, నేనూ కాదూ, ఆ ఇరవై వేల రూపాయల కారు పనులు సాధిస్తుంది, కొని సంవత్సరం కాలేదు. నాకు యాభై వేల రూపాయలు సంపాయించి పెట్టింది అది" అని పెద్ద నవ్వు నవ్వింది.

అంత స్పష్టమైన, కాపట్యం లేని మనసు వుంటుందా అనిపించింది అతనికి. అట్లాంటామె నాలుగు మాటలంటేనే? భరించడం నామర్దా కాదనుకున్నాడు.

పది రోజుల్లో పర్యటన బైలుదేరారు. నౌకర్లూ, కారూ, నాసీ శంకర్, ఆమె సిబ్బంది. దేశమంతటా ఉపన్యాసాలు ఇన్‌టర్‌వ్యూలు ఆహ్వానాలు - దిగ్విజయం చేసి మూడు నెలలకి తిరిగి వొచ్చారు. ఆ ప్రయాణం భారమంతా శంకర్ మీదనే పడింది. అన్ని చిన్నవిషయాలు చాలా జాగ్రత్తగా చూడాలి. రైల్లో బర్తులు, కారు జాగ్రత్త, భోజనం, మీటింగుల ఏర్పాట్లు, పత్రికల్లో ఆమె ఫోటోలు, న్యూసు, ఆమె ఉపన్యాసాలకి నోట్సు, అతను సమర్థతతో నెరవేర్చాడు చాలా కష్టపడి,

ఏ మాత్రం లోటు వొచ్చిన చాలా చురుకైన చివాట్లు. బాగా చేసినప్పుడు చాలా మెచ్చుకునే మాటలు, చిరునవ్వులు, దయ. ఆమె పొరపాట్లనీ అంత ఉదారంగానే ఒప్పుకుంటుంది. న్యాయమే ననిపించింది అతనికి. ప్రతిదానికి 'శంకర్, శంకర్' అని అందరి ముందూ అతన్ని పొగుడుతుంది. అతను లేకపోతే తన పని సున్నా అంటుంది. తన ఉపన్యాసాల గొప్పతనం కొంత అతని కాపాడిస్తుంది. ఏమన్నా లోపం జరిగితే అందరి ముందూ అతన్ని దివాలా తీస్తుంది.

మీటింగుకి పావుగంట ఆలస్యంగా వెళ్ళింది ఆమె. అతని తప్ప అంది కారులో. అతన్ని దగ్గిరగా తన పక్కనే కూచో పెట్టుకుంటుంది.

ఉపన్యాసం ప్రారంభిస్తూనే—

"ఆలస్యానికి క్షమించాలి. నన్ను కాదు, ఎంత నేర్పినా లాభంలేని బుద్ధిరాని నా సెక్రటరీ శంకర్ని" అని. (నవ్వులు) చచ్చిపోయినాడు అతను. ఆమెతో వెడుతో వుంటే ఒక్కొక్కసారి ఆ గౌరవా లన్నిటికీ తనే అధిపతి ననిపించేది. కాని చాలాసార్లు ఆమె పెంచుకుని, వేషంవేసి తిప్పుతున్న కుక్కని అనిపించేది. ఏ నిమిషాన కారు ఆపి, "పో, దిగిపో" అని తోసేస్తుందో అని భయం. తిట్టిందా మర్యాదగా తిట్టదు, బూతులకి అట్టే దూరం లేదన్నట్టు నీచంగా తిడుతుంది.

చాలామంది శంకర్ని ఆమె ప్రియుడు అనుకుంటున్నట్టు తెలుస్తోంది అతనికి. చాలామందికి వేళాకోళం. చాలా మందికి ఈర్ష్య. మొత్తానికి తను చాలా అదృష్టవంతు డనుకుంటున్నారు.

అతని జీతం ఇప్పుడు మూడు వందలు- అతను ఏమాత్రం అడగకండానే. అతనికే కాదుట- ఏ నౌకరు కష్టపడి ఆమెని మెప్పించినా, ఆమె ఉపకారం చెయ్యడానికి అంతు వుండదు.

ఆమెని చూస్తే- ఆమె చిన్న వొళ్ళూ, తెల్లని రంగూ, నాజూకైన ముక్కూ, అరచేతులూ చూస్తే ఎవరికైనా ఆమె ప్రేమ కోసం పుట్టిందని

పిస్తుంది. కాని అదేం కనపడదు. ఇష్టమైన వాళ్ళతో చాలా చనువుగా వుంటుంది. కాని అంతవరకే.

అతనికీ ఆమె మీద చాలా ఇష్టం. కాని ఆమె వెక్కిరింపుల వల్లనో, చివాట్ల వల్ల నో, ఆమె మీద నిలవలేని కోర్కె కలగదు. కాని ఆమె పడకటింటి మిత్రు లెవరా అనే కుతూహలం మాత్రం వుంది.

ఆమెకీ అతనితో చాలా చనువు. ఇష్ట పడ్డదంటే ఆమె ఇంక సంకోచంలేకండా మనసిస్తుంది. ఐతే వాళ్ళు ఇద్దరు ముగ్గురు కన్న ఎక్కువ లేరు. తను కలుసుకున్న వాళ్ళ శరీరాల్ని మర్మం లేకండా వర్ణించి నవ్వుతుంది. ప్రతి వారిని గురించి తూలనాడుతో లెఖ్ఖలేకండా మాట్లాడుతుంది. వీలైనంత వరకు ఏ మాటంటే ఆ మాట అనేస్తుంది. వాళ్ళేమన్నా అంటే వినిపించుకోదు. తనమీద తృణీకారం చూపితే తప్ప, తనని ఎన్ని మాటలన్నా నవ్వేస్తుంది. ఎదురంటుంది.

ఒక రాత్రి భోజనం దగ్గిర సంభాషణ ప్రేమ మీదికి తిరిగింది.

ఆమెకి అప్పుడప్పుడు సూచనగా ప్రేమ లేఖలు కూడా వొస్తాయి. జవాబుకి వాటినీ అతనికే ఇస్తుంది. ఆమె కసలు ప్రైవేట్ కరస్పాండన్సే లేనే లేదు. ఆమెతో పరిచయమై ఎన్నాళ్ళకీ ఆమె దగ్గర చేరలేక, కొట్టుకుని, కోపించే మనుషులు చాలామంది ఉన్నట్టున్నారు. హద్దుమీరడం అసంభవం. ఎంత ఒంటరిగా, చనువుగా, ఎన్నాళ్ళు ఆమెతో వర్తించనీ, ఆమెతో మోహ సంబంధంగా ఏ కొంచెం దగ్గిరిగా కూడా రావడానికి ఎవరికీ గుండెలున్నట్టు కనపట్టంలేదు. కాని అమితంగా ఆమె ఆశలు రేపుతున్నట్టు కనిపించింది శంకర్‌రావుకి. మరి అందం, ధనం, ఐశ్వర్యం-ప్రపంచంలో కల్లా వాంఛనీయమైన విషయాలు ఆమెలో మూర్తీభవించాయి. పైగా ఆమె నీతీ, మర్యాదా ఓ లెఖ్ఖగా ప్రవర్తించదు. మాట్లాడదు. నీతిపరుల్ని, నీతి వేషాల్ని చీల్చి వెక్కిరిస్తుంది, మనుషుల మోహాల

మీదే. "దగ్గిరిగా కూచోండి. ఏమిటా దొంగ మర్యాదలు ! ఇంతలో నాతో పడుకుంటున్నారని అనుకోరు లెండి" అంది ఓ మంత్రిగారిని.

అట్లా మాట్లాడే శృంగారవతికి ఏం జవాబు చెపుతాడు పురుష మాత్రుడు ?

ఆమె భర్త సంగతి ఎప్పుడూ ఎత్తలేదు ఆమె. చూసిన కొద్దీ ఎడ్మిరేషను ఎక్కువౌతోంది శంకర్రావుకి.

ఆ ప్రేమ లేఖలకి జవాబుల్లో చాలా చమత్కారంగా తప్పుకుంటుంది. ఏమీ కాదనదు. ఔననదు. ఆ ఉత్తరంతో ప్రేమజాడ్యం కుదిరిపోయింది.

"దానికేం ? అట్లానే కలుసుకుందాం ! ఏమిటో ! మీ వాత్సల్యం వల్ల అలా అంటారుగాని నాలో ఏముంది ? ప్రేమకేం ? ఇదివరకు లేదు గనకనా, ఇంక ముందు ఏదో కావాలవడం ?"

అలా రాస్తుంది. అతనికే తెలిసిపోతోంది ఏ ఉత్తరానికి ఏం జవాబు రాయాలో !

"ప్రేమ ప్రేమ ! ఏం గొప్పమాట ! వీళ్ళందరికీ ప్రేమ ! వీళ్ళ మొహాలకి ! ఓసారి మరి అద్దం ముందు సరిగా నుంచుని చూసుకోకూడదూ ?" అంటుంది అతనితో.

ఆమె వొంటికేకాక, డబ్బుకీ వేస్తో వుంటారు ఎత్తులు, అప్పులనీ, వ్యాపారాలనీ. ముందే తెలుస్తుంది గావును ఆమెకి. డబ్బెవరికి కావాలో, తను ఎవరికి కావాలో, రెండూ ఎవరికో.

"రేపు బహుశా అప్పడుగుతాడు" అంటుంది- ఎవరి ద్వారానో పరిచయం చేసుకుని కారులో వొచ్చి ఆమెని మాటలతో రంజింపచేసినవాణ్ని.

ముందే అన్నీ తెలుసుకు రమ్మంటుంది శంకర్ని. తన అప్పుకి మంచి వొడ్డీ, షేర్లకి సరైన లాభం వొచ్చేట్టు కనపడితే, చాలా ఉదారంగా

పూరికేనే ఆ మనిషి మాట విలువమీదే ఇస్తున్నట్టు ఇచ్చేస్తుంది, దానం చేసినట్టే. లేకపోతే "ఎక్కడ వుందండీ డబ్బు ? చాలా ఖర్చుగా వుంది" అంటుంది.

ఈ పెద్ద పెద్ద బిజినెస్ మనుషులూ, రాజకీయ ధురంధరులూ ఆమె ముందు వుత్త పూక. కాని ఆమె మాటలూ పద్ధతీ, గోములూ మాత్రం ఏం తెలీని అమాయికపు నిస్సహాయపు స్త్రీవి. ఎంతసేపు ఈమెని మోసగించడం, మోహించడం అనుకునే వాళ్ళకి చాలా గట్టి బొప్పెలు కడతాయి. కాని బహిరంగంగా నిరోధించడానికి ఏమీ కారణం కనపడక, తమదే తప్పనుకుని స్నేహంగా వుండిపోతారు.

ఆ రాత్రి భోజనం దగ్గిర ప్రేమ ప్రస్తావన వొచ్చింది, కవిత్వ చర్చ ద్వారా ఏ చర్చ వొచ్చినా ఉన్నత వాతావరణంలోనే జరుగుతుంది ఆమె ముందు.

ఆమె భోజనం ఏర్పాట్లు కూడా ప్రత్యేకం. గుడ్లు తప్ప శాకాహారి. పెళ్ళికాని అయ్యంగారు స్త్రీకి పుట్టి తెలుగు నాయుణ్ని పెళ్ళిచేసుకుంది అంటారు కొందరు. వంట- కాయ కూరలే, కాని దాన్నిచూసి వంకాయ కూర అనుకోము. తిన్న తరువాత కూడా కొంత సేపటివరకు తెలీదు. పులుసు కలిపి అన్నం ప్లేట్లలో ముందు పెడతాడు బట్లరు. పెరుగూ కలిపే. మజ్జిగ తాగడానికి ఇస్తారు. ప్రతిపదార్థానికీ నిర్ధారణగా చెప్పలేని కొత్త పరిమళాలు వుంటాయి. ఆమె భోజనానికి పిలిస్తే యెవరినన్నా అదొక గౌరవమే కాదు, అవొక శృంగారానుభవం. ఆమె పిలవంది మాత్రం ఆమె బల్ల దగ్గరగాని, ఇంట్లోగాని స్థలంలేదు యెవరికీ.

ఎవరో కన్నడం ఆయన ఆమెని ఆహ్వానించడానికి వొచ్చాడు, సారస్వత పరిషత్తులో ఉపన్యాసం ఇవ్వడానికి. ఆమె కన్నడ సాహిత్యం సంగతి అడుగుతోంది ఆయనని.

"అయితే మీ జాగీర్దార్ మా చలం అన్నమాట" అన్నాడు శంకర్.

"అవును. చాలా పోలిక లున్నాయి" అని ఆమెతో- "మీ వంటి స్త్రీలు మా దేశంలో అరుదు. నవీన భావాలకు మా రచయితలు చాలా గర్వ పడతారు మిమ్మల్ని చూసి" అన్నాడు.

ఆమె నవ్వింది. "నాదంతా పైకి వేషాలలో పద్ధతులలో నవీనమే. నా భావాలన్నీ చాలా పురాతనం."

"ఏ విషయంలో ?"

"ముఖ్యం ప్రేమ విషయంలో."

"పాత పాతివ్రత్యం అదేనా ? ఇంకా వివాహ పద్ధతుల్లోకూడానా!"

"జరిగేవి జరుగుతున్నాయి. ఏం జరిగినా, పురాణాలూ, నీతులూ అలా వుంచి, అసలు సభ్యం అశభ్యం అనేది ఒకటి వుందిగా. ఆ రెంటికీ భేదం లేదన్నప్పుడే నా తగాదా."

"కాని ఆ భేదం కూడా మనిషి అభిప్రాయం మీదనే ఆధారపడ్డది కదా ? మీ దృష్టే ప్రతివారికీ వుండాలని ఏముంది ?" అన్నాడు శంకర్.

"అభిప్రాయ భేదాలకేం ? ఎవరి వీలునుబట్టి వారి అభిప్రాయాలు మారుతూ వుంటాయి. వ్యభిచార దృష్టి బలంగా ఉన్న మనిషికి, నైతికాభి ప్రాయాలు వంకర కాక ఏం చేస్తాయి ?"

"కాని సాంఘిక పరిస్థితులలో ? అందరు స్త్రీలకూ మీకున్న నిగ్రహ శక్తి వుంటుందా ?" అన్నాడు శంకర్.

ఆ మాటలకు ఆమె చాలా గర్వపడ్డది. ఆమె సెక్రటరినించి ఆ మాటలు గొప్ప టెస్టిమోనియల్.

"ఉండదు. నాకు మాత్రం వుందని ఏమిటి ? నాదీ శరీరమే. కాని తక్కిన పట్లు బలంగా పని చెయ్యాలి అంటాను."

"కాని ఆ తక్కిన పట్ల అవసరం, అర్థం, న్యాయం, ప్రశ్నిస్తు న్నారు రచయితలు" అన్నాడు ఆయన.

ఆ మాటలతో ఆయన పరిషత్తుకి ఆమె వెళ్ళే ఛాన్సును పోగొట్టు కున్నాడు.

"ఆ పటల్లో, అభ్యంతరాల్లో అర్థం, న్యాయం, వుండవొచ్చు, వుండకపోవచ్చు. కాని ఆ నిబంధనలు స్వంత జీవితాలపైన ఏర్పరచు కున్న మనుషులు ఎంత ఉన్నతులో, వారి ఆత్మ బలం ఎంత బలీయమో గమనించ నక్కర్లేదా?" అన్నాడు శంకర్.

ఆ మాటలు ఆమెని పొగడడానికి అనలేదు అతను. నిజంగా ఫీల్ అయే అన్నాడు. అ మాటతో ఆమె కళ్ళు మెరిశాయి.

"ఆ ఔన్నత్యం ఎంత మోసమో చూపుతో చాలా కథలు బయలు దేరాయి, మీ తెలుగులోనే" అన్నాడు ఆయన.

ఆ మాటలు ఆమె వినిపించుకోక ఆయన్ని పూర్తిగా ఉపేక్షించే సింది అటు తరవాత.

మళ్ళీ ప్రచారానికి బయలుదేరారు. శంకర్‌కీ ఆమెకీ చనువు ఎక్కువయింది. అధికారిణీ స్వరూపం తగ్గిపోయింది ఆమెలో. అక్కా తమ్ముడూ అయినారు వాళ్ళు! మీటింగు అయిన తరావాత రాత్రి అతని దగ్గిరికొచ్చి కూచుంటుంది. క్షవరం కాగానే అతని చంపలు రాసింది ఓసారి. చాలా పరియాచకా లాడుతుంది. ఆమెకి అతను ఎంత సేవ చేస్తాడో, అంత సేవా అతనికి చేస్తోంది, భోజనంలో అతనికి ఏమిష్టమో, అతనికి అన్నీ సదుపాయాలూ జరుగుతున్నాయో లేదో కనుక్కుంటుంది. ఆమెని భోజనానికి ఆహ్వానించి అతన్ని ఆహ్వానించకపోతే వొప్పుకోదు.

"మా శంకర్నో!" అంటుంది.

ఆమె మనసులో అతనిమీద అభిమానం ఎక్కువైన కొద్దీ పబ్లిక్‌లో అతనికి గౌరవం తగ్గుతోంది. ధనికురాలు ఉంచుకున్న దొంగ

ప్రియుణ్ణి చూసినట్టు నీచంగా తనని చూస్తున్నా రనిపించింది అతనికి.

కొద్దిరోజుల్లో అతనికి చాలా స్పష్టమయింది, ఆమె తనని కోరు తోందని. ఇన్నాళ్ళూ ఆమె ఎంత చనువు తీసుకోనీ, అతనికి ధైర్యం లేదు. ఆమెతో తాను చనువు తీసుకోడానికి. తనంతట తాను ఆమె చేతిని కూడా తాకలేదు. అప్పుడప్పుడు కారులో ఆమెతో కూచుని, వూపుకి ఆమె మీద వొరిగాడు. అంతే. కాని ఆమె తనకి కావాలా? కావాలి. కాని ఆమె తన దవుతుందన్న ఆలోచన యెందుకో పెద్ద సంతోషాన్ని ఇవ్వలేదు. ఎందుకో!

రాత్రులు అప్పుడప్పుడు ఆమెకి నిద్రపట్టక అతన్ని తన గదిలోకి పిలిచి కబుర్లు చెప్పమనేది. చదివించుకునేది. మెడవరకు కప్పుకున్న ఆమె ఒంటిమీద ఎంతమాత్రం బట్టలున్నాయో అని అతని క్యూరియా సిటీ. ఒక్కొక్కరాత్రి మంచం పక్కన ఉన్న కుర్చీలోంచి ఆమె మీదికి ఒంగాలని చాలా బలంగా ఆవేశం ఒచ్చేది. తన గదిలోకి వెళ్ళి పడుకున్న తరవాత తానెంత పిరికివాడా అని చాలా కోపం కలిగేది.

అందమైన ఆ గది, నీలంగా సన్నని వెలుగు పడేసే ఆ దీపంలో ఆమె ఆ పెద్ద పట్టుదిళ్ళ మంచం, కిటికీలోంచి తోట అందం, మెరిసి నిరీ క్షించే నక్షత్రాలు, రేరాణీ పూల పరిమళాలు, వాన చినుకులు పడుతూ వుంటే నేలలోంచి బద్ధలై కమ్ముకునే సృష్టి శక్తి సౌరభం, ఆ నీలం కాంతిలో దిండుమీద పరుచుకున్న ఆమె జుట్టు తరంగాలు, చంపకింద కనపడే కంఠం, ఆ పల్చని పట్టు దుప్పటిని పైకి తోసుకుంటో తన కళ్ళ కింద ఎదుగుతున్నట్టు కనపడే ఆమె రొమ్ము చివర్లు ఆమె తొడలవాలు - ఎట్లా నిలవగలిగాడో ఆ యువకుడు పాపం!

అతను కావాలని కాకపోతే, ఎందుకు తన గదిలోకి రాత్రులు పిలు స్తుంది? కాని ఆ సమయాలలో ఆమె మొహం గంభీరంగా అధికారంగా

వుంటుంది. వింటుంది. కాని మాట్లాడదు. అతనివంక చూడనన్నా చూడదు. ఎంత ప్రయత్నించీ ఆ ఆరంగుళాల దూరం తన మనసులో కాని, మాటలోగాని దాటి చేతిని జాచలేదు. "వీల్లేదు-ఏ మాత్రం వీల్లేదు" అన్న ఒక వాతావరణం, ఒక శక్తి, ఆమె లోపలినుంచి బయలుదేరి అతన్ని వెనక్కి నెడుతోం దనిపించింది. రోజంతా అతన్ని పిలుస్తుంది ఆమె దేహం. ఆమె ఇష్టానికి తిరగబడా? కాని రాత్రి ఆ గదిలో మాత్రం అతనికి పూర్తిగా విరోధం.

రాత్రులు తన పక్కమీద పడుకుని, ఆమెని తలుచుకుని, అతని మనసూ దేహమూ కూడా నీరసపడి పోతున్నాయి. ఏమో, ఏ రాత్రో ఆమె తన గదిలోకి రాకూడదా అని యెదురు చూసి చూసి నిద్రరాదు. కాని ఆమె మీద అతనికి ఇష్టంలేదు. ఉత్త యవ్వనం. రక్తం రక్తానికి పిలుపు. ఆ పిలుపులోంచి పెద్ద యిష్టం ఉద్భవం కావాలి సహజంగా. కాని ఆమె విరోధం. ఎక్కడి కక్కడికి ఆమెలోని ఆకర్షణని పెరగనీకండా తుంచేస్తున్న విరోధం, నిర్లక్ష్యం, వెక్కిరింపు. ఆమె దేహం పిలుస్తుంది. ఆమె మనసు పొమ్మంటుంది. మనసుకే విజయం.

ఆమె సుఖంగానే వుందిగాని. శంకర్ చిక్కిపోతున్నాడు. ఆమె కూడా ప్రశ్నిస్తోంది దయగా, 'ఆరోగ్యం బావుండలేదా?' అని. తన జ్ఞాతి చిక్కిపోయి తనని వారన్ చేసిన సంగతి జ్ఞాపకం వొచ్చింది. ఈ అవస్థ అతనూ పడ్డాడా? అందుకనే క్షయ రోగిలాగై నాడా? తన గతీ అంతేనా? చివరికి పీనిగై శక్తి లేనినాడు ఇంకో సెక్రటరీ కావాలని పత్రికల్లో వేస్తుందా ఈ మహాకాళి! తను ముందే యెందుకు వెళ్ళిపోకూడదు? వెళ్ళ లేడని అతనికి చాలా స్పష్టంగా తెలుసు. జీతం, భోగం. అంతేకాదు, ఆమెని విడిచి వుండలేడు.

ఓ రాత్రి అతనికి చాలా రోషం వొచ్చింది. ఏమిటి? తనెందుకు ఇట్లా నలిగిపోవాలి? తన కేమిటి ఆ భయం? ఏం మహాగొప్ప! ఆడది కాదా? తనని ఈ విధంగా నాశనం చేస్తో వుంటే, తానేం అంత చాతగాని వాడా? అని యెంతో చెప్పుకున్నాడు. మర్నాడు రాత్రి కూచున్నాడు చదువుతో, ఏదో కళమీద ఒక రష్యను రాసిన పుస్తకం. తనలో పెరుగు తున్న రోషం అతని కంఠం పట్టుకుంది. మాట తడబడుతోంది, ఆమె తల తిప్పింది అతని వేపు.

"ఏమిటి? వొంటో బావుండలేదా?"

"ఏమిటి?"

"రాత్రులు నిద్రలేదు."

"ఆ బిల్లమీద నిద్ర మాత్రలు వున్నాయి. తీసుకు వెళ్ళు."

"అదీ - కాదు."

"ఏమిటి?"

ఆమె కంఠంలో ఏమీ దయలేదు. భయంలేదు. ఉత్త విరోధం. ఎంతో దూరం.

ఆమె కళ్ళల్లోకి చూస్తో వూరుకున్నాను. ఆమె కోపంగా మండి పడుతో చూస్తోంది అతని వంక.

'సాహసించు, సాహసించు. ఏమిటి భయం?' అంటున్నారు ఎవరో అతని లోపల. కాని చెయ్యి కదలదు.

అంత మండిపడే మనిషిని ఎవరేం చెయ్యగలరు? ఎన్నో చేతులతో అతన్ని తలుపువేపు తోసేస్తోంది ఆమె.

చాలా నీరసంగా సంకోచంగా ఆమె వేళ్ళ కొనల్ని తాకాడు. తన వేళ్ళని ఓ క్షణం అట్లానే వుంచాడు. దానికోసమే యెదురు చూస్తున్నట్టు ఆమె చివాలున లేచి కూచుంది. దుప్పటి కిందికి జారిన ఆమె బట్టలేని బుజాలు, ఆ బుజాల కింద నీలం కాంతిలో ఓ పక్క మెరుస్తో వెలుగులో అతని చూపులు అతుక్కుని పోయినాయి.

ఆమె బిగ్గరగా నవ్వింది.

"వెళ్ళు, వెళ్ళిపో. ఏమిటీ వేషాలు! వెళ్ళవేం?" నిజంగానే అంటోంది.

ఏం చేస్తాడు? తలవొంచుకు వెళ్ళిపోయినాడు తన గదిలోకి.

ఆ రాత్రి నించి ఆమె మీద తాచుపాము పగపట్టాడు శంకర్. ఎన్నటికీ మరవలేని అవమానం. తనని ఆకర్షించి గదిలోకి పిలిచి-అది ఆడదే కాదు-రక్తాలు పీల్చే భూతాలు నయం దీనికన్న. కానీ దీని పని రేపు రాత్రి అనుకున్నాడు. మర్నాడు ఆమె మామూలుకన్న దయగా వుంది అతని మీద. కాని ఆ రాత్రినించి అతన్ని గదిలోకి పిలవలేదు.

అతని ప్లాన్స్ భగ్నమైనాయి. ఇంక ఆమె నేం చేస్తాడు? వారం రోజులయింది. అతని కసి ఏ మాత్రం తగ్గలేదు. ఆమె మీద విరోధం అతనికి. ప్రతి మాటలో ఏదో ఒకటి అంటున్నాడు ఆమెని. కాని రోజు రోజూ ఆమెకి దయ ఎక్కువౌతోంది. ఏమో టానిక్కులు తెప్పించి స్వయంగా ఇప్పిస్తోంది అతనికి. విలువైన బట్టలు కుట్టించింది.

ఆనాటి మధ్యాహ్నం, లైబ్రరీలో చదువుకుంటున్నాడు. జవహర్ లాల్ స్వీయ చరిత్ర. చాలా శాంతంగా వుంది. వాన కురిసి వెలిసి ఆకాశంలో ఏర్పడ్డ సరోవరాల్లోంచి బైలుదేరి వస్తోంది గాలి. ఎండ గంతులేస్తో వొచ్చి ఆడుతోంది చెట్ల ఆకుల మీద నీటితో. పిట్టలన్నీ బైటకివొచ్చి కిలకిల మంటున్నాయి.

ఆమె వొచ్చింది లైబ్రరీలోకి. అతన్ని చూడలేదు. ఏదో పుస్తకం వెతికి తీసుకుంది. అతను తలెత్తలేదు. వెడుతో అతన్ని చూసింది. దగ్గిరికి వొచ్చి "ఏమిటి? చదువుతున్నావు? ఓ! ఇట్లాంటి మధ్యాన్నం ఈ అందంలో యువకుడు చదవ వలసిన పుస్తకమేనా?"

అని తన చేతిలోని పుస్తకం బల్లమీద పెట్టి వెళ్ళి ఇంకో పుస్తకం తెచ్చి, తెరిచి వెతికి చూసి, నవ్వుతో అతనికిచ్చింది, బట్టలు లేని ఫ్రెంచి బొమ్మలు.

"అవి చదువు. నీ భార్యకి ఉపయోగం" అని నవ్వి, అతని జుట్టుని వూయించి వెళ్ళిపోతోంది అతనింక నిలవలేదు. తోకతొక్కిన తాచుపాము మల్లే లేచాడు.

"ఆగు" అన్నాడు అధికారంగా.

చప్పున కోపంగా తిరిగింది అతని వేపు. ఎంత తృణీకారం! దాంతో అతని రక్తం విషం అయింది. భగ్గుమన్నాయి మంటలు గుండెల్లో. నిలువునా జ్వాలామయ మయింది.

ఒక్క దూకులో ఆమెమీద పడ్డాడు. ఆమెతో సహా తివాసీమీద పడ్డాడు. ఆమె పమిట బాడిస్ చింపేశాడు. ఆమె పెదిమలోంచి రక్తం కారుతోంది. కళ్ళు మండిపోతున్నాయి. ఏదో తిడుతోంది. కాని అతన్ని ఆమె ఒళ్ళు లాగేసింది, ఏమీ విరోధపడలేదు.

ఆమెని తివాశీ మీద అట్లానే వొదిలి, వెళ్ళి తన కుర్చీలో కూచున్నాడు వగురుస్తో. ఆమె లేచి కూచుని నెమ్మదిగా సర్దుకుని, అతనివంక చూడకండానే లేచి వెళ్ళిపోయింది.

మర్నాటినుంచి ఆమె అతనితో మాట్లాడడం మానేసింది. వారం రోజులయింది, అతనికేం పశ్చాత్తాపం రాలేదు.

ఓ ఉదయం కాఫీ కాగానే షాఫరు వొచ్చి "రండి" అన్నాడు.

"ఎక్కడికి?"

"ఏమో! అమ్మగారు రమ్మన్నారు" అని కారు దగ్గిరికి తీసికెళ్ళాడు. తన పాత పెట్టా, జంపఖానా చుట్టి వున్నాయి కారులో. అతన్నడిగి వాచీ, పెన్నూ తీసుకున్నాడు నౌకరు. వరండాలో పదిమంది యువకులు కూచుని వున్నారు.

కారులో స్టేషన్‌కి తీసికెళ్ళి అతని వూరికి సెకండు క్లాసు టిక్కెట్టు కొని యెక్కించారు. చేతిలో ఒక కవరు పెట్టి వెళ్ళిపోయినారు. ఆ కవరులో వెయ్యిరూపాయలకి చెక్కు.

# పాప ఫలాలు

కాశీపతి వృత్త పనికిమాలిన యువకుడు. చదువుకునే రోజుల్లో ప్రతి దినం శ్రద్ధగా బడికి వెళ్ళేవాడు. టీచర్లు వొద్దన్నా వొదిలేవాడు కాదు. ఇంటి దగ్గిర పాఠాలు చదవ వలసిన కాలంలో మర్నాడు టీచర్లని ఏడిపించ డానికి క్రమమైన పద్ధతుల్ని పన్నాగం చేసేవాడు. పడలేక డిస్‌మిస్ చేశారు చాలా దిగులుగా ఎందుకంటే—ఆ బడికి నాలుగు కప్పులు సంపాయించాడు, ఆటల పోటీలలో.

తరవాత అనేకమైన చిల్లర వృత్తులో తన ప్రావీణ్యం చూపాడు. తాపీ పని, బట్టల వర్తకుడి కింద, ఇన్సూరెన్సు ఏజెంటూ, రైల్వే గుమాస్తా మొదలైనవి. అన్నిచోట్లా తన అధికారుల దవడలూ, ముక్కులూ మొద లైనవాటి ఆకారాలు మార్చడానికి ప్రయత్నించడం వల్ల, చాలా దిగులుగా ఆ ఉద్యోగాలు మానుకోవలసి వొచ్చింది. అన్ని తగాదాలూ ధర్మ సంరక్ష ణార్థమే పెట్టుకునేవాడు. కాని యీ గాంధీ యుగంలో అతని హింసా పద్ధ తులు ఖైదుదాకా తీసుకుపోయేటంత అపాయకరమై పోయినాయి. ఖైదుకు వెళ్ళేవాడేగాని, అక్కణ్ణించి ఎక్కడికీ డిస్‌మిస్ కావడానికి వీలు లేనందున వెళ్ళకండా తప్పించుకున్నాడు, ప్లీడర్లనీ, మేజస్ట్రేటునీ బెదిరించి. చివరికి ఒక పొరుగూరి మిత్రుడిద్వారా, అమెరికన్ స్త్రీకి తెలుగు చెప్పే మున్షీ ఉద్యోగం సంపాయించాడు.

ఆమెకి ముప్పై యేళ్ళు వుంటాయి. చాలా చక చక లాడుతో వుంటుంది. ఆమె దేశంలో ఆమె అందమేమో గాని కాశీపతికి అందమని

పించలేదు. ఆమెకి రోజూ పొద్దున్న ఓ గంట చదువు చెప్పాలి. ఆ గంట సేపూ ఏదో ఒకటి తింటూనో, తాగుతోనో వుంటుంది ఆమె. మొదట కాఫీ, మధ్య టాఫీలూ, chewing gum (చూయింగ్ గమ్), చివర పళ్ళ రసం. ఆమె మీద కన్న అతనికి ఆ తిండి మీద యెక్కువకన్ను. మూడు నెలలకి ఆమెకి చిన్న మాటలు చదవడం వొచ్చినప్పుడు అతనికికూడా కాఫీ బిస్కట్లూ ఇచ్చింది. తరవాత టాఫీలకీ పళ్ళరసానికీ అట్టే దూరం లేదను కున్నాడు.

క్రమంగా వ్యవహారాల్లో కూడా ఆమెకి సహాయం చేస్తున్నాడు అతను. ఆమెకి ఉపయోగ పడడం కోసం, ఆమె టైపు రైటరు మీద అభ్యాసం కూడా ప్రారంభించాడు.

జీతం కూడా హెచ్చించారు. యాభై రూపాయలయింది.

జీతం కన్న అతనికి—ఆ పెద్ద బంగళాలో చుట్టూ తోట—నీడలు—పిట్టల శబ్దాలు, శాంతి—అక్కడ కూచోడం, ఆమె నవ్వులు వినడం—చూడ వచ్చిన పంతులమ్మల దగ్గిర అధికారంగా మాట్లాడడం.

చిన్న పిల్ల మల్లే తెలుగు వుచ్చరించడానికి ప్రయత్నించే ఆమె. అవస్థతో సానుభూతి చూపడం, చాల సరదాగా వుందీ, తక్కిన రోజంతా తన జేబులో యెన్నడూ లేనిది చిల్లరతో ధనికుడి మల్లే తిరగడం, చాలా హాయిగా వుంధి జీవితం. తల్లి దండ్రులకీ అక్కలకీ కొంచెం ధన సహాయం చేయడంతో అతని ప్రాముఖ్యం హెచ్చింది ఇంటి దగ్గిర. అతని పాత స్నేహాలు సన్నగిల్లాయి. అతని రౌడీ మిత్రులు అతని పేరు లిస్టులోంచి కొట్టేస్తున్నారు-ప్రయోజకులలోకి, మర్యాదస్తులలోకి, మరణించాడని.

కాని చేసిన పాపాలు వెంట నంటక మానవు యీ కర్మ భూమిలో. ఎవరన్నా తప్పించుకు బైటపడాలని చూసినా, మిత్రులూ, హితులూ, పాత చిట్టాని పెళ్ళగించి, చిత్రగుప్తుడికీ, సంఘం పెద్దలకీ

జ్ఞాపకం చేసి తీరతారు. ఈ అపకారమంతా రాజ్యక్షేమం కోసం, ధర్మోద్ధరణ కోసం ఉదార బుద్ధితోనే జరుగుతుంది. క్రమంగా ఆమెతో గుస గుసలు ప్రారంభించారు నల్లరంగు పెద్దలు· అతను నమ్మదగిన మనిషి కాడని. కాని ఆ యత్నం చాలా ఆలిస్యంగా జరిగింది. ఆమె విశ్వాసాన్ని చలింప చెయ్యలేక పోయినారు. పైగా ఆమెకి కాశీపతి మీద అభిలాష యెక్కువయింది. అతను మాత్రం పాప ఫలం అనుభవించక తప్పలేదు. ఉద్దేశ్యాలకీ, వాటి పర్యవసానాలకీ లోకంలో అంత వైరుధ్యం వుండబట్టే, లోకం అంత మిస్టీరియస్‌గా కనపడుతుంది. అతన్ని తప్పిద్దామని పెద్దలు ప్రయత్నిస్తే ఆమెకి అతని మీద పట్టు మరింత బిగిసింది. కాని ఆమె ఆ దయ వల్లనే అతనికీ చాలా ఘోరమయిన అవస్త సంప్రాప్తయింది.

కాశీపతి ఆత్మాభివృద్ధి తన బాధ్యతకింద తీసుకుని, తన దైవం ఆదేశ ప్రకారం, అతన్ని ఋజుమార్గానికి తిప్ప నిశ్చయించుకుంది ఆమె. ఈ నిశ్చయం అతనికి చాలా ఉక్కిరి బిక్కిరయే రూపాలు తీసుకుంది. అతని ఆత్మకోసం అతని ముందే అరగంటసేపు ప్రార్థిస్తుంది. ఆ రోజంతా ఏమేం చేశావని అడుగుతుంది. దిద్దుతుంది. సద్గ్రంథాల్లో నించి భాగాలు వినిపిస్తుంది. వాటిని తెలుగులో చెప్పడానికి ప్రయత్నిస్తుంది, తన భాషా సాధనకూడా కలిసి వొచ్చేట్టు.

"పశ్చాత్తాప పడు. నీ ఆత్మని దేవుడి పాదాలవద్ద నివేదించుకో" అని బతిమాలుతుంది.

ఆ ఉద్యోగం వదిలి పారిపోవా లన్నంత ఘోరమైన స్థితిలోకి జారింది అతని జాతకం.

ఇంక భరించలేక రెండు రోజులు శలవు తీసుకుని మేనమామ గారి ఇంటికి వెళ్ళాడు ఆ రెండు రోజులు శలవలో ఎన్ని పైపరీత్యాలు జరగడం జరిగిందో ఆనాడు యెవరికి తెలుసు ?

ఆదే వూరు మొదట తనకి ఉద్యోగమిప్పించిన మిత్రుడిది. అతను కాశీపతి యోగక్షేమాలడిగి తనకో సహాయం చేసిపెట్టమన్నాడు.

"తప్పకండా."

" ఆ లేడి దగ్గిర రత్నం అనే అమ్మాయి వుంది, నీకు తెలుసా?"

"అవును. తెలీకేం?"

ఆ బంగాళాలో ముఖ్యమైన అమ్మాయి ఆ రత్నమే. రత్నాన్ని చూస్తే ఆ లేడికి చాలా ప్రేమ. ఆమెకి కాపీలు అవీ అందించడానికి ప్రతి నిమిషం వెంట తిరగడానికి, తన అపభ్రంశపు తెలుగు భాషని ప్రయోగం చెయ్యడానికి, ఆ నిర్భాగ్యురాలు రత్నం దొరికింది ఆమెకి అనుకున్నాడు కాశీపతి ఇదివరకే. అందువల్లనే గావును రత్నం కళ్ళల్లో ఆ దిగులు, జీవితంలో ఇంకేం మిగలలేదు అనే నిరాశ• ఆ అమ్మాయి ఊపిరి పీల్చు కొని తన బతుకుకాలం తనది అని ఏ నిమిషాన అనుకోడానికి వీలుం టుంది? అనిపించింది. ఈశ్వరా! రాత్రులు కూడా తన పక్కనే పడుకో పెట్టుకుంటుంది గావును? అని దిగులు పడ్డాడు.

"ఆ రత్నానికి నువ్వో కబురు చెప్పాలి రహస్యంగా."

ఆ అమ్మాయితో తా నింతవరకు ఒక్కమాట మాట్లాడలేదు, దిగులు పడడం తప్ప.

"ఏమిటి?"

ఆ ప్రశ్నకి ఆ మిత్రుడు ఏదో పెద్దగాథ చెప్పాడు. ఆ అమ్మాయి మీద ఆ యువకుడికి ప్రేమ. ఆమెకి ఓ ఉద్యోగం సంపాయించాడుట ఈ వూళ్ళోనే. ఆ ఉద్యోగం చాలా మంచిదని రత్నాన్ని ఒప్పించి పంపించ మన్నాడు. కాశీపతికి ఈ రహస్య రాయబారం రుచించలేదు. ఇతను తన మిత్రుడైన మాట నిజమే. ఆ అమ్మాయి చాలా ఇరుకులో వున్నమాట నిజమే. కాని తన్నివారణకు ఈ మిత్రుడు సూచించే చికిత్స మీద కాశీపతి విశ్వాసం కుదరలేదు. మొగాళ్ళ యెడల మంచి మిత్రుడే కాని

ఆడవాళ్ళ యెడల ఇతను శత్రువనిపించింది. తన తిరుగుబోతు తనం వల్ల నేర్చుకున్నాడు కాశీపతి, ఒక్క మనిషికే ఎన్ని వింత వింత వింత ముఖాలు వుంటాయో!

"నువ్వే వొచ్చి రత్నంతో మాట్లాడరాదూ?"

"ఆ ముండ ఓ నిమిషం దాన్ని ఒదలదోయ్."

"పోనీ పెళ్ళిచేసుకుంటా నను."

"నా కిదివరకే పెళ్ళయింది బాబూ, అది తెలీదా ఏమిటి నీకు?"

"అయితే నీకీ పిల్లతో యేం పని?" అని అడిగే అధికారం లేదు కాశీపతికి. ఈ రూపంలోనే వెంబడిస్తాయి పాత పాపాలు. "మరి పూర్వం నీకా పతివ్రతలతో ఏం పనిపట్టి వాళ్ళ ఇళ్ళ చుట్టూ తిరిగావు నువ్వు?" అని తప్పకుండా అడుగుతాడు తన అంతర్యాలు తెలిసిన ఆ మిత్రుడు.

"అంతే కాదు. ఆ తెల్ల దెయ్యం లేదూ, అదీ మా ఇద్దర్నీ గుర్రంపాకలో ఒక రాత్రి టార్చిలైటు వేసి చూసింది. ఆ వేపుకి వొస్తే నన్ను టుపాకీపెట్టి కాలుస్తా నంది. నిన్ను ఉద్యోగానికి పెట్టిన కొద్ది రోజులకే ఇదీ."

మొత్తానికి నిష్కామంగా తన బాధ్యత లేకుండా మిత్రుడి రాయబారం నడిపి పెడతానని వాగ్దత్తం చేశాడు కాశీపతి.

మళ్ళీ ఉద్యోగంలో చేరగానే, ఒంటరిగా చూసి - "రత్నం, నీకు కబురు తీసుకొచ్చాను" అన్నాడు.

బెదిరి చూసింది ఇటూ అటూ.

"ఏమిటి?" అంది.

"ఇక్కడ చెప్పడానికి వీల్లేదు."

"నాకు కబు రేమిటి? ఎవరి దగ్గిర్నించి?"

యజమానురాలి ద్వారా రత్నానికి కూడా కాశీపతి మీద చాలా విశ్వాసం గనుక అంతమాత్రం మాట్లాడింది.

ఎవరి దగ్గిర్నించో చెపితే, కార్యం మొదలే చెడుతుందనే లోక జ్ఞానంతో అతను, "ఎవరి దగ్గిర్నించో; నీకు చాలా కావలసినవాళ్ళ దగ్గిర్నించి. చెపుతాను-మాట్లాడాలి. ఎప్పుడు వీలు?" అన్నాడు.

ఇద్దరికీ భయమే, ఎక్కడినించైనా ఆమె వింటోందా అని. కాని అంత తొందరగా మాట్లాడే తెలుగు అర్థం చేసుకునే పాండిత్యం ఇంకా ఆమెకి ప్రసాదించలేదు ఈ గురువుగారు. అదీ ధైర్యం. కాని తటాలున వొచ్చి "ఏమిటి మాట్లాడుతున్నారు" అంటుంది; మంచి మత మాధుర్యం చిరునవ్వుతోనే అనుకోండి. కాని వాళ్ళ చిరునవ్వుని ఎన్నడూ నమ్మడానికి వీలులేదు. అది వాళ్ళ వృత్తి. వాళ్ళ బోధనా పాఠశాలలో యీ చిరునవ్వు తర్ఫీదు ఇచ్చే పంపుతారు ఇతర దేశాలకి. చాలా దయగల చిరునవ్వుతోనే డిస్మిస్ చేస్తారు కాలేజీల్లోంచి విద్యార్థుల్నీ, నౌకరీల్లోంచి నిర్భాగ్యుల్నీ.

"ఎక్కడా విరామం దొరకదు. ఓ నిమిషం వొదలదు. చూస్తున్నారుగా! ఓ కాయితం మీద రాసి ఇవ్వండి."

"కాదు. రాస్తే తెలీదు—మాట్లాడాలి!"

ఆలోచించింది రత్నం.

"ఆదివారం తెల్లవాళ్ళ ప్రార్థనకి పోతుంది. రాత్రి యెనిమిది ఇంటికి రండి" అంది.

రోజు రోజూ ఇతనిపైన ఆ లేడీగారికి బాధ్యత ఎక్కువౌతోంది. ఓ విధంగా అతన్ని పెంచుకుంది ఆమె. పుస్తకాలిస్తోంది చదవమని మర్నాడు "ఎంత వరకు చదివావు? ఇష్టపడ్డావా? ఏం ఇష్టపడ్డావు?" అని ప్రశ్నలు. ఎంత జీతం ఇచ్చినాసరే, ఇంక ఈ ఉద్యోగం వొదులుకోవలసిన సమయం ఆసన్నమయిందని తెలుస్తోంది అతనికి. బళ్ళో టీచర్ల

మొగాళ్ళు గనక సరిపోయింది గానీ, ఈ రకం ఆడవాళ్ళైతే, తాను యెంత విద్యాధికుడై గొప్ప గవర్నమెంటు హోదాలో వుండేవాడో ఈ పాటికి?

తన మీద ఆమె వాత్సల్యం వుత్త మత ప్రచారం కాదనీ, దైవ సేవే కాదనీ, ప్రత్యేకంగా తనని వుద్ధరించాలని ఆమె శ్రమ పడుతోందని అతనికి తెలుస్తోంది. ఈ విధంగా ఆ వాత్సల్యం ఎక్కువై పోయిందా, తనూ మతంలో చేరడమో, కాక నిరంతరం ఆమె కళ్ళముందు ప్రార్థనలో గడపడమో, మొత్తానికి లోకప్పు పనులకూ సరదాలకూ యెందుకూ పనికిరాని వ్యర్థుడైపోవడం జరిగి తీరుతుందనిపించింది. మెడమీద కత్తికింది కోడిమల్లె గిలగిల లాడుతున్నాడు.

కథలోకి ఇద్దరు ఆడవాళ్ళని తీసుకొచ్చి, చలం ఇంత సేపు పూరుకున్నాడేం అని తొందర పడుతున్నారా? వొస్తున్నాను. నా పాఠకుల్ని నిరాశ పరిచే పాపం కట్టుకోను. కాకపోతే కాశీపతి మల్లె నేను ఆ పాప ఫలం అనుభవించవలసి వొస్తుంది. అదృష్టం కలిసి వొస్తే ఒక్క ఫలమే కాదు ఫలాలు అనుభవించడం కూడా జరుగుతుంది. గొప్ప అదృష్టం కలవారికి పాప ఫలాలు అవే వచ్చి పైనబడి, పుణ్య ఫలాలుగా మారతాయి.

ఆ ఆదివారం సాయంత్రం బంగళాకి వెళ్ళాడు. ఇదివరకెన్నడూ రాత్రి అటు వెళ్ళలేదు. విద్యుద్దీపాలు. రాధా మనోహరి పువ్వు గుత్తుల వెనక నుంచి నైట తోటలో జిమియా పూల మీదా, పొద్దు తిరుగుడు పూలమీదా పడుతున్నాయి. వరండా కుర్చీల వార్నిషు దీపాల కింద మెరుస్తోంది. తలుపుకి కట్టిన కర్టన్‌లు రాత్రి వెలుతురులో అసలు అందాల్ని కనపరుస్తున్నాయి.

కిటికీలోంచి చూస్తోంది గావును రత్నం, వెంటనే వొచ్చింది.

"కూచో, చెపుతాను" అన్నాడు.

ఆమె కూచోకంజా అనుమానంతో నుంచునే వుంది. కుర్చీలమీద కూర్చునే అర్హత ఆమెకి లేదు.

"ఎంత సేపటికి వొస్తుందేం?"

"పదింటికిగాని రాదు. ఎవరో భోజనానికి కూడా పిలిచారు. బట్లరు బావగారి యింటికి వెళ్ళాడు."

"నువ్వు ఒక్కదానివేనా ఇక్కడ?"

"ఊఁ."

"అట్లా రోడ్డు మీదికి రా."

"ఇల్లు వొదిలా? పైగా చూస్తారు మనని రోడ్డు దీపాల కింద."

పూర్వానుభవం ఆమెని భయపెడుతోంది అనుకున్నాడు.

"సరే, ఇక్కడే కూచో."

"రోడ్డు మీద నుంచి కనపడతాము."

"దీపం ఆర్పెయ్యి."

"దీపం లేదేమీ అనుకుంటారు బండీవాళ్ళు."

వాళ్ళ కాపరం ఆ కాంపౌన్డులోనే.

అబ్బ. ఆడవాళ్ళ జాగ్రత్తలకి అంతులేదు. చాలా బాధ పడ్డాడు ఇదివరకు కాశీపతి.

"ఒరే! పది నిముషాల ఉత్సవానికి, ఇరవై నాలుగు గంటలు సన్నాహాలురా ఈ ఆడవాళ్ళకి" అనేవాడు రౌడీ మిత్రులతో ప్రాణం విసికి. కాని తనకంటే ఏ భయాలు లేవుగాని, ఆడవాళ్ళు అబలలు మరి. ఈ పిల్ల చేనికి ఒప్పుకోక ఏం చెయ్యమంటుంది? యెందుకు రమ్మన్నట్టు తనని? ఏ మాలోచించింది? యెక్కడా వీలు లేకపోతే, యెట్లా మాట్లాడడం?

కాని ఈ అబలల సాహసానికి మొగవాడు ఏ మూలకీ చాలడన్న సంగతి అతను గ్రహించలేదు.

"ఇట్లా రండి" అని లోపలికి, తానెన్నడూ పాదం మోపని అంతః పురాలలోకి తీసికెళ్ళింది, యజమానురాలి పడక గదిలోకి. దీపం వెలిగించి, ఫాన్‌చేసి, అతన్ని ఆమె మంచం మీద కూచోమంది, ఆమె సాహసాన్ని అందుకోలేక పోయినాడు, మన వెయ్యి గలభాల రౌడీ యోధుడు.

సందేహిస్తో కూచున్నాడు. మంచి విలువైన స్ప్రింగు మంచం. ఆ మంచం ఆ యజమానురాలి తెల్లని దేహ పరిమళాల్నేగాని ఇంత వరకు....'అనాఘ్రాతం పుష్పం. కిసలయమలూనం' అనిపించింది.

రత్నం దీపం ఆర్పి, చిన్న దీపం వేసి (దానికి కూడా నీలం షేడ్ వుంది) మంచం మీద దూరంగా కూచుంది.

"ఏమిటి సమాచారం?" అంది, లోపలి చిరునవ్వుతో.

భయంతో అతని నోట మాట రాలేదు.

ధైర్యం అనేక రకాలు. ఇరవై మంది కర్రలు కత్తార్లతో వొస్తే అతనికి ఏమీ భయం లేదు. కాని దొరసాని వొస్తుందంటే భయం. ఆమె కొడుతుంది, తిడుతుంది, పోలీసులకి అప్పగిస్తుందన్న భయం స్వల్పం. ప్రార్థన చేస్తుందని మహా భయం. అదిగాక మామూలు స్థలాలలో ఎన్నడూ ఎంత అపాయంలోనూ భయం లేని వాళ్ళకి కూడా, అసంగత మైన దివ్యముహూర్తాల భయం పట్టుకుంటుంది, అపరిచిత ప్రదేశాలలో.

"ఆమె వొస్తే...."

"రాదు. వొచ్చినా ఇక్కడికి రాదు. నా కోసం కేకేస్తుంది. బండి ఈ కిటికీ కింద నుంచే వెడుతుంది."

"ఈ గదిలో ఈ పిల్ల ఆదివారం రాత్రులు ఏమేం చేసిందో" అని అనుమానం వొచ్చిందిగాని....ఎందుకో నమ్మలేదు అతను.

రత్నం చాలా పిరికి పిల్ల !!!

చెప్పడం ప్రారంభించాడు. కాని మొదట్లోనే...."వాడి సంగతి నాముందెత్తకండి, చాలా ఘాతకుడు. ఏం చేశాడో తెలుసా?" అంది.

"తెలుసు. కాని ఈ సంగతి చెప్పమన్నాడు" అని చెప్పాడు. కాని ఆమె ఏమీ కదలలేదు.

"అంతేనా?" అని లేస్తోంది. "నేను రాననీ, నా కిట్లాంటి కబుర్లు పంపవొద్దనీ, నిశ్చయంగా చెప్పండి. ఈ సారి దొరసానితో చెపుతానని తెలియ చెయ్యండి. రండి."

తన మిత్రుడి కార్యం భగ్న మయింది. ఆమె లేచి వెళ్ళి పోతోంది మరి. ఆ మంచం మహత్యం గావును, ఆ మెత్తదనం లోంచి ఓ పట్టాన లేవ లేక పోతున్నాడు కాశీపతి. మిత్ర కార్యం సాధించాలి.

"రత్నం!"

"ఊ"

"నీ కిక్కడ బావుందా?"

ఆ ప్రశ్న విని ఆగిపోయింది వెళ్ళే పిల్ల. అతనికి యెదురుగా దూకుడుగా వొచ్చి నుంచుని "బావుందో లేదో....బావుండకపోతే, ఆయనగారు నన్ను వుద్ధరిస్తాడా ? మీరు వుద్ధరిస్తారా?" అంది.

"నాకు తెలీదు నీ మీద చాలా ప్రేమలాగుంది అతనికి" అంటు న్నాడు, ఆమెని బొడ్డునించి ముఖం కేసి చూస్తున్న అతను. అట్లా చూస్తే అతనికి రత్నాన్ని సరిగా తాను ఇదివరకు చూడలే దనిపించింది.

"ప్రేమ! ప్రేమ!! అందరికీ నామీద. దొరసానికి ప్రేమే, అతనికీ ప్రేమే. ప్రేమ అంటే కొరుక్కుతినడమేగా; ఎవరైతేనేం?"

ఆమె మాటలో జీవితంలోని రసహీనత్వం, నిర్భాగ్యత్వం, ఏదో ఒక బోనులో నుంచి ఎన్నటికీ విముక్తిలేని నిరాశ, స్వేచ్ఛకోసం, సొంత బతుకుకోసమైె ఈ నూతన బానిసల ఆర్తనాదం వినిపించింది అతనికి.

"పాపం! రత్నం, ఏం చెయ్యను?" అన్నాడు అప్రయత్నంగా స్వేచ్ఛావిహారి అయిన ఆ రౌడీకి తెలిసినట్టు. ఏదో ఒక దాస్యంలో, ధనం, కీర్తి, మర్యాద, అధికారపు బంగారు సంకెళ్ళన్ని ఘనంగా ధరించి కులికే ఆశాబంధితులకి అర్థం కాదు ఆ బాధ. ఆ గంటలో తనకి ఊపిరాడకపోతే యేళ్ళకొలది రత్నం ఏమైపోతో వుండాలి, ఆ యజమాను రాలి దిద్దుళ్ళలో!

చాలా హృదయాంతరాళంలోంచి అన్నా డా మాట. ఎన్నడూ విన పడని ఆ దయ—మతంకోసం కాక, ఉబికిన తన పొగరు రొమ్ముకోసం కాక, తననో ఇంటిదాన్ని చేసి వంశోద్ధారణ కోసం కాక, తన కోసమే, తన బాధకోసమే విన్న ఆ మాటతో ఆమె హృదయం విహ్వాల మయ్యింది.

చప్పున ఏడ్చింది.

అట్లాంటి సమయాలు, పలకరింపులు, తండ్రి కొడుకు, భార్య భర్త అనే బంధత్వంకాక, యజమాని, నౌకరు, స్నేహితుడు, మతస్థుడు, ఉద్యోగి, దొంగ, వర్తకుడు....ఇట్లాంటి పొరలు తొలిగి, మనిషి ఇంకోట్టి వుత్త మనిషిగా, చివరికి స్త్రీ పురుషులుగా కాక, వుత్త మనిషిగా పలక రించే సమయాలు చాలా అరుదు.

కాని అట్లాంటి పలకరింపులు ఎప్పుడో అనుకోకండా, జరిగినప్పుడు జీవితాలలో గొప్ప హృదయాలలో మార్పులు జరుగుతాయి. అట్లా పలక రించే ఆత్మశక్తి రౌడీలలో, వేశ్యలలో, దిక్కుమాలిన వాళ్ళలో-వాళ్ళలో కూడా ఏ ఒక్కరికో వుంటుంది. మామూలుగా ఆమెని ప్రతిరోజూ చూస్తు

న్నాడు జట్కా-గుర్రాన్ని చూసినట్టు. కాని ఆ గది నిశ్శబ్దంలో ఏకాంతంగా ఏడ్చే ఆమె రొమ్ముని అడుగునుంచిచూసి భరించలేకపోయినాడు కాశీపతి.

ఆ ఉద్రేకపు వూపున, అట్లా ఆ పెద్ద రొమ్ము నిస్సహాయంగా, దిక్కు-లేకుండా లేచిపడడం భరించలేకపోయినాడు. ఆపడాని కని మీద చేతులు వేసి, అణిచి, చుట్టూ చేతులు పోనిచ్చి, మీదికి తీసుకున్నాడు. ఆ బలువుతో ఆ పక్క-కి అడ్డంగా పడ్డారు.

ఆ సమయంలో మనుష్య మాత్రులు అంతకన్న ఏం చేస్తారు? నరాల్లో రసంలేని (మానవా) తీతులు మాత్రం నీతుల్నీ, ధర్మాల్నీ మాట్లాడ గలరు.

ఏ ఫీటర్సుబర్గులో చేసిన మంచమో అది, ఈ వేడి దేశానికి వొచ్చి ఎన్నేళ్ళనించి కాలిపోతోందో, ఈ నాటికి ఆ మంచం నిర్మాత ఉద్దేశ్యం పూర్తిగా నెరవేరింది. ఆ స్ప్రింగులు కలకలమని నవ్వుతో గంతు లేశాయి.

అయిపోలేదు కథ.

ఎందుకంటే-ఆ సమయానికే ధర్మశీలురాలు దైవం ముందు మోక రించి తన జీవితాన్ని మానవసేవలో సఫల పరచమని వేడుకుంటోంది. ఆ దైవం కనికరిస్తాడో లేదో చెప్పలేనుకాని, నేను ఆమెకి ఆ వర మివ్వ తలుచుకున్నాను. ఆమె నేను నా కలంతో మంత్రించి ప్రాణ మిచ్చిన ఇంకో పుణ్యవతి. నేను యముణ్ణి. నా కలం పోటునించి ఎవరూ తప్పించు కోలేరు, వాళ్ళ పుణ్యఫలాలు అనుభవించిందాకా. ఆమె జీవితాన్ని సఫల పరిచిగాని వొదలను. ఆ లేడీని, ఆమెనే కాదు, మిమ్మల్నీ విడవను నా కథ చివరి అక్షరం మీ కళ్ళలోంచి వెళ్ళి, మీ నరాల్లో అగ్ని లేపి, మీ హృద యాల్ని కారుణ్యంతో-మీ హృదయా ల్నేమిటి, నిలువునా మిమ్మల్ని కది గించి అర్థం చేసిందాకా,

"ఎట్లా జరిగింది?" అడగండి గాలినీ, రక్తాన్నీ, జీవితపు బాధని, యవ్వనాన్నీ! ఆమె దేహం అడిగింది. ఎదురుపడి ప్రశ్నించింది రత్నం పాటకపు రొమ్ము-సహజ జీవితంలో, ముగ్గురు పిల్లల కడుపు నించవలసిన ఆ రొమ్ము; భూసారం నుంచి తన కేమీ ఇవ్వలేని నిస్సారపు చదువులో, ఎరువు తెచ్చుకుని పొట్టకోసం పులుముకున్న మతంలో, దిక్కులేక అల్లల్లాడుతో, నీతి వాక్యాల చావుకి యెదురు తిరిగి మగవాణ్ణి 'నువ్వా ఓ మనిషివేనా?' అని ధిక్కరించిన ఆ రొమ్ము!

చదువుల, ఉద్యోగాల మురుగుడు శవంగా తయారు కాని కాశీపతి ఏం చేస్తాడు అంతకన్న? తిన్న తిండి వొంట బట్టే రౌడీ! ఆడమనిషి రొమ్ము పొగరుగా ధిక్కరించి, ఛాలెంజి చేస్తే!

కాని వొచ్చిన ఖర్మ మేమిటంటే-ఏక్ దిన్‌కా సుల్తాన్ అయి పోయింది అతని పని. అంతే-మర్నాటినుంచి ఏదో ఒక్క చూపు, సగం మాట, వేళ్ళ చివర్ల స్పర్శతో తృప్తిపడవలసి వొచ్చింది వాళ్ళు.

దొరసానికి అనుమానం, ఆమెకి తెలీకుండానే పనిచేస్తోంది. సహజం, ఎందుకంటే వాళ్ళిద్దరూ మంచి దిట్టమైన మృగాలు. వాళ్ళ పూర్వుల్ని నాగరికత నాశనం చెయ్యలేదు. నరాల్లోంచి సారం పీల్చేసి, వుత్త చచ్చు దొంగల్ని చెయ్యలేదు. నిజమే, వుత్త పశువులు-కాని పట్టు బట్టల మూలల, ఇనప పెట్టెల బంగారు బరువుల కింద సగం నలిగిన నీతి పురుగులు మాత్రం కారు. అందుకని వాళ్ళు వాంఛతో గాలినే నింపారు. ఎండకే మెరుగుడు పెట్టారు వాళ్ళ చూపులతో. వాళ్ళిద్దరూ దగ్గిర చేరితే చాలు-విద్యుచ్ఛక్తులు మెరుస్తున్నాయి, ఎండు హృదయాల్ని మండిస్తో. జీవిత శక్తే ఒక నూతన వికాసంతో ఎదిగే గడ్డిలో నవ్వుతోంది. పురుగులు తాగి తొక్కిన పువ్వులు, వూగుతో పాటలు పాడుతో గదిలోకి తొంగిచూసి స్వాగతమిచ్చాయి వాళ్ళిద్దరికి. పాపం, దొరసాని హృదయంలో స్పందించ

కుండా ఎట్లా వుంటాయీ జ్వలించే శృంగార తరంగాలు? కాని హృదయం లోంచి మెదడులో ప్రవేశించేసరికి పెద్ద అనుమానంగా మారాయి.

కనిపెడుతోనే వుంది వాళ్ళని. ఓ ఉదయం ఆమె స్నానం గది లోంచి చప్పున వొచ్చి, షైపుకొస్తే కాశీపతి స్టూల్ మీద వెనక నుంచుని అతని కంఠంమీద చేతులేసి రత్నం అనుకోడం చూసింది. అతను ఆమె చేతిని పట్టుకున్నాడు. చప్పున ఆ గదిలోకి ప్రవేశించింది, పూర్తిగా డ్రెస్ చేసుకోకుండానే. ఆర్త రక్షణకై శ్రీ మహావిష్ణువు తన లక్ష్మి కుచోపరిచే లాంచనమైన వీడడు.

రత్నం దూరంగా దూకింది. కాశీపతి చప్పున వెనకాలకి తిరిగాడు కొంప మునిగిందని. కాని దగ్గరే ఆ కిటికీ వెనక తీగె సంపెంగ పొద మీదనే కూచుని వున్నాడు మన్మథుడు, విల్లెక్కుపెట్టి, బాణం సంధించి, ఈ వేడి దేశపు ఉద్రేకపు హృదయ విదళితలైన పరిమళాలతో దట్టించిన పుష్పాల్ని పొదిలో ఇముడ్చుకుని. కాశీపతి చూపు మీదనుంచి, దొరసాని గుండెలమీదికి గురిచేశాడు. ఆ మెత్తని బాణం ఆమె మత కవచానికి తగిలి వ్యర్థమైన ఆమె స్లిప్స్‌మీద పడిపోయింది. కాశీపతి చూపు మాత్రం ఆ బాణం లక్ష్యంమీదనే లగ్నమయింది, ఆ తెల్లని, నున్నని వెన్నముద్దల మీద-గౌనుతో కప్పని ఆమె బాహుమూలాలనించి, మెల్లిగా మృదువుగా ఆమె బాడీనంతా పలకరించింది చాలా ఉల్లాసంగా. ఆమె ఒక్క మాట మాటాడక చిరునవ్వుతో కోపాన్ని కప్పి వెనక్కి తిరిగినప్పుడు కూడా, కనబడే ఆమె నడుం బలంనుంచి, ఆగ్రహం తెప్పించిన ఆమె ఘనాన్ని కావలించుకుంది, ఇటునుంచి అటువరకు అతని చూపు.

ఇద్దరిమధ్య అట్లాంటి నిప్పురవ్వ పడ్డదంటే అది రగులుకోక మానదు, ఆ స్త్రీ పురుషులు చాలా దూరమైపోతే తప్ప. దూరం కాకుండా చూసే దేవతలు చాలామంది ఉన్నారు, స్త్రీ ప్రపంచరీతుల్ని గమనిస్తో కాని ఆమె మతం ఆమెకి గొప్ప రక్ష.

ఎంత స్వతంత్రం రానీ, ఎంత విజ్ఞానం పెరగనీ, మతం అనే టప్పటికి మూర్ఖం తప్పదు. హేతువాదానికి అతీతమైన విషయాలు వుండ వొచ్చు. ఉన్నట్టే కనపడతాయి, ముఖ్యంగా మతాలలో. కాని ఆ మతానికి సంబంధించిన అన్ని విషయాల్లో కూడా బుద్ధీ, హృదయం. మనిషిలో ఉన్న ఔన్నత్యం, వేటినీ పనిచెయ్యనీరు. ఎవరో కొంతమంది తప్ప. వాళ్ళలో చాలామంది మతాన్నే వొదిలేస్తారు ధైర్యమున్న వాళ్ళు. మతంతో వుండి, ఆ మత విషయంలో సంపూర్ణమైన బుద్ధి వికాసంతో హృదయ ఔదార్యంతో పనిచెయ్యగలవారు తక్కువ. అందువల్లనే పూర్వపు ప్రభువులు మతాన్ని తమ అధీనంలో వుంచుకోడానికి ప్రయత్నించారు. ఈనాటి ప్రభుత్వాలు మతాన్నే నిర్మూలం చెయ్యాలని చూస్తాయి.

లేడీ లోపలికి వెళ్లిపోయింది, రత్నం తోటవేపు పరుగెత్తింది. కాశీపతి తుపాను ఎదుర్కొనే నావికుడిమల్లే సిద్ధపడుతున్నాడు. అరగంటలో అమెరికన్ స్త్రీ చిరునవ్వుతో ఒచ్చి, తెనుగు పుస్తకం తీసి, "కాశ్మీరదేశపు సుందరులు ప్రపంచంలో నెల్ల" అని చదువుతోంది, ఏ మెరగనట్టు.

ఆనాటినుంచి పాఠాలలో అతని మాటలలో ముద్దులు, చూపుల్లో మార్దవం, అతని దేహం అప్రయత్నంగా సామీప్యం. రత్నం అసలు ఆ గదిలోకి రావటమే లేదు.

అతను ఎదురుచూస్తున్న తుపాను మూడో రోజున విరుచుకుపడ్డది- కాని చాలా మార్దవంగా, పెద్దమనుష్యుల మధ్య చర్చమల్లే. అతను అనుకున్నది ఆమె తనని తిట్టి వెళ్ళకొడుతుందని. కాని ఆమె- "ఏమిటో నీ ఉద్దేశ్యం?" అని అడిగింది కళ్ళు కిందికి వాల్చి.

"ఏ విషయం?"

"రత్నం సంగతి....."

దొంగతనం ఏమీ లేకుండా మాట్లాడాలని అతను ముందే నిశ్చ యించుకున్నాడు. ఆమె రత్నంతో ఇదివరకే మాటాడి వుంటుంది. ఎంత

వరకు చెప్పింది రత్నం? ఏ విధంగా చెప్పి వుంటుంది?. ఈ మెషనరీలు ఇట్లాంటి సంబంధాలు గొప్పగా ఇష్టపడతారనీ, ఐతే ఆ తప్పులన్నీ పురస్కరించుకుని. మొగాణ్ణి అదరకొట్టి, బెదిరించి, అతన్ని మతంలో కలిపి, ఆ అమ్మాయికి పెళ్లి చేస్తారనీ, చాలామంది బ్రాహ్మలు అట్లానే క్రిస్టియన్‌లు ఐనారనీ విన్నాడు. మిత్రులు తనని జాగ్రత్తగా వుండమని కూడా చెప్పారు ఇదివరకు.

ముందు జాగ్రత్తని తెచ్చిపెట్టుకోలేక పోయినాడు గాని, ఇంక జాగ్రత్తగా వుండదల్చుకున్నాడు. తన వాళ్ళని ఒదిలి, ఆ చర్చిలో బైబిలు వింటో, ఆ రత్నం వైబిలు తెలుగు రోజల్లా వింటో, ఆమెకి సిద్దీలవంటి పిల్లల్ని కని పోషించాలని అతనికి ఎంతమాత్రమూ లేదు. పైగా వాళ్ళ మర్యాదలూ, ఇంగ్లీషు వేషాలు, పందిమాంసాలు....అంతే కాదు — బట్టల శుభ్రమూ అందమూ చూసి, ఆ బట్టల లోపల వాళ్ళు శుభ్రంగా అందంగా వుంటుందని అనుకోడం పొరబాటని తెలుసుకున్నాడు. ఒంటి శుభ్రం, అందం చూసి, ఆ ఒంటికింద మనసు శుభ్రం, అందమని, మాటకి పనికీ చాలా తేడా లేదని చదువుకుని స్వేచ్ఛగా పెళ్లిళ్లు చేసుకునే, తెలవిగల ఆడపిల్లలు దిన దినమూ చేసే పొరబాట్లు కూడా అతనికి తెలీవు. భర్తలతో ఘోరమైన కాలం గడుపుతో పైకి సంతోషాన్ని పెట్టుకుని లోకాన్ని మోసపుచ్చి అభిమానాన్ని నిలబెట్టుకోవాలని చూసే నవీన స్త్రీల మల్లేనే, అంతా అందమని రత్నం వక్షమూ, వక్షం మీదపడే కన్నీళ్ళూ మోసం చేశాయి అతన్ని. అంతేగాక, ఎంత సూక్ష్మ దృష్టితో చూసినా నలుపురంగు తెలుపురంగుతో పోటీకి నిలవలేదు.

"రత్నం సంగతి ఏమిటి?" అని యెదురు తిరిగాడు.

"పెళ్ళి చేసుకో."

గట్టి ప్రశ్న! అప్పుడే అంతదూరం అవుతుం దనుకోలేదు.

"రత్నానికి ఆ వుద్దేశ్యం వుందా?"

కాశీపతిలో యీ కృత్రిమ అమాయకత్వం ఆమె తోవని చిక్కులు పెడుతోంది. అతనిలో నిజంగా అమాయకత్వం వుందేమో! కాకపోతే ఆమె అనుభవంతో కూడిన సునిశిత దృష్టిముందు అబద్ధం నిలవలేదు. ఘోరమైన నేరాల వెనక కూడా చాలా అమాయికత వుంటుందని తెలుసుకో గల ఔదార్యమూ, తెలివీ, వ్యవధీ వుండదు మనుషులకీ, మేజిస్ట్రేట్లకీ.

"ఆమె సిద్ధంగానే వుంది."

"నేను లేను."

"ఆమెమీద నీకు ప్రేమ లేదా?"

"లేదు."

"మరి ఎందుకు చేశావు ఆ పని?"

అంతా తెలుసుకుందా? లేక తన చుట్టూ వల పన్నుతోందా?

"ఏం పని?"

ఆ పనికి ఆమె ఉచ్చరించగల ఇంగ్లీషుమాట గాని, తెలుగు మాట గాని ఆమెకి దొరకలేదు.

"నీకు తెలీదా?" అంది.

తాను ఏమీ చెయ్యలేదు అనాలి. కాని లోపల్నించి నిజం మాట్లాడదా మనుకున్నాడు గద, ఆమె మీది ప్రేమవల్ల వొచ్చిన కొత్త గౌరవం వల్ల! అతను రౌడీ. బాధ్యతలు అంగీకరించడు. పోయే కీర్తిలేదు. ఈ సంగతి అందరికీ తెలిసినా, ఏమీ వింత పడరు. అందువల్ల అతనికి అబద్ధాలాడవలసిన ఆవశ్యకత లేదు.

ఏం జవాబు చెపుదామా అని ఆలోచిస్తో వుండగా, చలం జ్ఞాపకం వచ్చాడు. రౌడీ కావడంచేత, హోటల్లో రేడియో వాగనప్పుడు, తియ్యబూందీ తినే పెద్ద మనుషుల మధ్య, చలం పుస్తకాల్లోని పేలుడు బాంబుల్ని బిగ్గరగా చదివేవాడు.

"అయితే, మేము చేసిన పని పాపకార్యమైతే, దాన్నే జీవిత మంతా చేస్తో వుండమంటారా?"

ఆ ప్రశ్న అర్థం చేసుకునేప్పటికి చాలా సేపు పట్టింది, ఆమెకి. ఎప్పుడూ బైబిలు సంబంధమైనవి తప్ప ఏమీ చదవనిదీ, పంతులమ్మలతో తప్ప విశాలమైన దృష్టిగల మనుషులతో యెవరితో మాట్లాడనిది ఆమె. వాళ్ళ మతం చాలా గొప్పదనీ, అంతకన్న తెలుసుకోవలసింది ఇంక లేదని, భారతదేశపు విజ్ఞానమంతా తమ పంతులమ్మల మాటల్లోనే ఇమిడి వున్నదని విశ్వసించే వారికి వాస్తవ జీవితాన్ని మాట్లాడే కాశీపతి మాట లెట్లా అర్థమౌతాయి?

"నువ్వు చేసిన పనిలో అపరాధం నీకు గోచరించటమే లేదా? ఆ అమ్మాయిని మరిగించుకుని నువ్వు వొదిలెయ్యటం న్యాయంగా కనపడు తూందా?"

"వొదిలెయ్యటం లేదు. మీరు ఒప్పుకుంటే ఆమెకి అవసరమై నన్నాళ్ళు ఆమెని వొదలనని వాగ్దానం చేస్తున్నాను."

ఆమె చాలా చిక్కుల్లోపడి ఆలోచిస్తోంది, అతని మాటల అర్థం.

"పెళ్ళి చేసుకో అయితే!"

"పెళ్ళి చేసుకోవడ మెందుకు?"

"మరి ఆమెకి దిక్కెవరు?"

"ఇన్నాళ్ళూ యెవరూ? ఇంక ముందూ వాళ్ళే."

"నేను. నేను ఇంక ఆ మనిషిని యెందుకు చూడాలి?"

"ఆమె మీద ప్రేమకద మీకు; ప్రేమ లేకపోయినా నన్ను ఆమెని పోషించ మంటున్నారు. ప్రేమగల మీరు వొదులుతారా?"

ఏడుపు వొస్తోంది ఆ మిషనరీ లేడీకి.

"ఇట్లాంటి పనులు చూస్తో వుంటేనా?"

"మీ కేం అపకారం ఆ పనులు."

"దేవుడికి అపకారం చేసింది."

"మీకేం ఒకవేళ అపకారమైతే అతనికి, అతనే చూసుకుంటాడు, ఆ సంగతి."

"నీకు ప్రేమలేంది యెందుకు చేశావు ఈ పని?"

ఆమె కన్నీళ్ళకి సమీపంలో వుంది.

"క్రిష్టియన్ మిషనరీలు.ఐ వుండి ఆ మాట అడుగుతారా మీరు? ప్రేమ వుంటే ఆ పని చెయ్యడంలో ఘనత ఏముంది? ప్రేమగల మనుషులందరూ చేసే పనే అది! జీసస్ ఏమన్నాడు? ఆకలితో వున్నవాడికి తిండి, బట్టలు లేని వాడికి బట్టలు ఇవ్వ మన్నాడు. ఈమె అవసరం అంతకన్నా గొప్పది. మూడు రోజుల నించి తిండిలేక సోషిల్లిన మనిషిని మీ గుమ్మం లోంచి పొమ్మంటారా?"

ఆమె ఇంక భరించలేక పోయింది. మండిపడుతో, రోషపు కన్నీళ్ళతో, అతని మీదికి లేచింది, ఇంగ్లీషులో తిడుతో - తన మతాన్ని, ప్రపంచానికి వెలుగు నిచ్చిన తన దైవం మాటల్ని అట్లా వికృతం చెయ్యడం భరించలేక.

"పో. ఇక్కణ్ణించి పో" అంటోంది.

భయంతో అతనూ లేచి నుంచున్నాడు.

తన మీదికి వొచ్చే, ఆమె బిగించిన గుప్పెట్లని చూసి తనని కొడుతుం దనుకున్నాడు. వెళ్ళి పోయేవాడే. కాని రౌడీ; ఆడదాని కోపానికి భయపడిపోవడం అతని మర్యాదకి లోపం. అట్లానే నుంచున్నాడు.

"పోవేం? పోవేం? నా ఇంటివేపు రా, చెబుతాను!"

ఆమెది తల్లి కోపం. తనింత కష్టపడి పెంచి బాగు చెయ్యాలను కున్న యువకుడు అట్లాంటి పనిచేసి, పశ్చాత్తాప పడకుండా, ఇట్లాంటి మాట లంటున్నాడు.

"ఇంకా నుంచుంటావేం? పో, నా కళ్ళముందు నించి పో."

దూకింది అతని మీదికి. బూడ్సుకాలు మెత్తింది. అతను ఆమె గుప్పెట్లని పట్టుకున్నాడు. చాలా గట్టిగా పెనుగులాడి తిడుతోంది అతన్ని. కాసే రౌడీ అతను. తన ఉద్రేకానికి తగినట్టు అతన్ని తిట్టాలంటే, మతంలో చేరి, చిన్నప్పటి తన పల్లెటూరి తిట్లు అలవాటు తప్పాయి ఆమెకి. ఒక ఉద్రేకం చూపడానికి ఏ మార్గం లేనప్పుడు, ఉక్కిరి బిక్కిరై ఆ ఉద్రేకం అనేక మార్గాల వ్యక్తమౌతుంది.

అదిగాక చాలా అందమైన ఉదయం. శాంతమైన బంగళా. పక్షుల చిన్న చిన్న ఈలలు.

పైగా ఈ సంపెంగ తీగెమీద విల్లెక్కు పెట్టుకుని, చంపక పుష్పం సంధించి అనంగుడు—పక పక నవ్వుతో.

ఆమెని వొదిలాడు రౌడీ. ఆమె వొళ్ళు ఆమెకి తెలీదు. తాను తృణీకారంతో చూసే: ఈ నల్లజాతికి అట్లా లొంగిపోవడం, నల్ల నౌకర్ని సహాయార్థం పిలవడం ఆమెకు నామోషీ రివాల్వరుతో సాధించ వలసిన సమయం కాని రివాల్వరూ లేదు, నౌకర్లు దాపున లేరు.

చప్పున ఏడ్చింది.

"ఏడవకు. ఏడవకు నువ్వు చెప్పినట్టు వింటాను."

రోషానికి విక్రమం, కన్నీళ్ళకి అనుతాపం ధీర పురుషుల లక్షణం, శ్రీరాముడి వంటి ఉదాత్త పురుషుల గంభీర స్వభావం అని ఆమె కన్నీళ్ళు తుడిచాడు ఆమె చేతిరుమాలుతోనే, ఆమె రొమ్ముకి వేసుకుని దానితో తుడుచుకున్న Lily of the valley పౌడరు పరిమళాల్ని పెదవిమ్మె

చిన్న రుమాలుతో. ఆమె ఇంకా తన భావోద్రేకంలోనే ఒళ్ళు తెలీకండా వుంది గావును, ఏమనలేదు.

కళ్ళని తుడిచాడు, చంపల్ని తుడిచాడు. ఇంకా ఆమె కన్నీటి కాలవ వొడ్డునే వేళ్ళతో ప్రయాణం చేసి, బుజాలకింద తుడిచాడు. ఆ మహానది ప్రవహించిన వెన్నెల బయళ్ళలో, స్నిగ్ధఉన్నతాలని తప్పించుకుని పక్కగా ప్రవహించిన లోయలోకి కూడా అతని వేళ్ళు వెళ్ళి మృదువుగా ఆమెకి తెలీకుండానే ఆ వరదల్నించి ఆమె శోభని రక్షించాయి.

గంగను స్వర్గం నించి భూమికి పిలిచాడు భగీరథుడు. కానీ వరదల్ని ఆపి, అగస్త్యుడు కూడా ఐనాడు కాశీపతి.

"ఏడవకు. ఎందుకు ఏడుస్తావు ?" అని ఆమె పెదవుల మీద ముద్దు పెట్టుకున్నాడు.

దెబ్బతిన్న పాము మళ్లే లేచింది అతని మీదికి. రెండు మూడు పెద్ద కేకలు కూడా వేసిందేమో; అతన్ని చంపమీద ఫెడేలున కొట్టి, కసి తీరక అతన్ని గుద్దింది. ఆమెని గట్టిగా పట్టేసుకున్నాడు. చేతులు రొమ్ము—అన్నీ ఇనుప కవచంలో మళ్లే బంధించాడు. ఆమెకి వూపిరాడ లేదు గావును. గొంతు కూడా నులిమాడేమో ! చాచుకుని, తెల్లగా, సన్నగా, నరం తీవ్రంగా, కొట్టుకొంటో తన పెదిమల్ని పిలిచే, పరిమళాన్ని చిమ్మే ఆమె కంఠాన్ని.

ఆమె వొళ్లో ప్రాణం లేకండా అతని చేతుల్లో బరువెక్కింది. వొదిలాడు కొంచెంగా. ఆమె ఒరిగి పోయింది. జుట్టు వూడిపోయింది పిన్నులు రాలి.

ఎక్కడ పడుకో పెట్టడానికి ఏమీ లేదు ఆ గదిలో. అట్లానే సునాయసంగా చేతుల్లో ఆమె నెత్తుకుని, ఆమె గదిలోకి తీసుకు వెళ్ళి ఆమె

మెత్తని స్ప్రింగు పక్కమీద పడుకోపెట్టాడు. ఆమె కళ్లు తెరవలేదు. కంఠం రాశాడు. మెల్లిగా వెతికాడు. ఆ బట్టలు కొత్త. ముళ్లూ, పిన్నులూ ఎక్కడ గుచ్చుకుని కట్టుకుంటారో తెలీదు అతనికి. ఏ బట్ట కింద ఏముంటుందో, యెన్ని బట్టలు వుంటాయో తెలీదు. వెతికి వెతికి పిన్నులు, బిక్కల్సు తీసి ఒదులు చేశాడు. ప్రథమ చికిత్సలు తెలీనివాడు గనక, గుండెలు రాశాడు. అబ్బా ! ఎంత తెలుపు అనుకున్నాడు.

ఏం చేసినా, పాపం ఆమె కళ్లు తెరవలేదు.

తరవాత ?

తరవాత నన్ను రాయనీయరు. రాస్తే అదంతా చదివి, మరీ వొచ్చింది అతనికి అని మీరే తిడతారు నన్ను.

వాళ్ళిద్దర్ని ఆ గదిలో, మిమ్మల్ని మీ గదుల్లో, దీవించి, నేను ఇంటికి వెడుతున్నాను. శలవు.

# అప్పుడూ - ఇప్పుడూ

వాడు కాలేజీలో చేరిం తరువాత కొన్ని యేళ్ళు నేను సుభ్రమణ్యం మొహం చూడలేదు. ప్లీడరు కాకూడదని మేం పట్టిన శపథాలు మరిచి, ప్లీడరు వృత్తి భోగంవృత్తి కన్న నీచమని నిశ్చయించుకొని తిట్టిన తిట్లన్నీ దిగదుడుచుకొని, తండ్రి ఆగ్రహానికి జడిసి నీచంగా లా కాలేజీలో పిరికి వాడై చేరాడనుకొని వాడిమీది అభిమాన మంతా మళ్ళించేసుకున్నాను. తరవాత నేను బెంగుళూరు వెళ్ళడం, మా కుటుంబంలో అవస్థలూ, అత్త వారితో తగాదాలు, వీటి మధ్య వాణ్ణి అసలే మరచి పోయినాను.

ఇన్సూరెన్సు యేజంటునై తిరుగుతూ, బెజవాడలో ఒక పెద్ద మేడకి సుభ్రమణ్యం ప్లీడరీ చెక్క చూశాను. వెంటనే వాణ్ణి చూడాలని పించింది. అదిగాక వాడి మేడ విస్తీర్ణం పట్టి వాణ్ణో అయిదు వేలకి యిన్సూరెన్సు బుట్టలో వెయ్యవచ్చని ఆశకూడా పుట్టింది. విశాలమైన హాలులోకి వెళ్ళగానే కాయితాల కట్టల మధ్యా, పదిహేనుగురు కింకరుల వంటి క్లయింట్ల మధ్యా కొట్టుకుంటున్న వాడు అక్కడ కనపడ్డాడు. నన్ను చూడగానే వాళ్ళని వొదిలించుకొని సంతోషంతో లేచి కావిలించుకొని లోపలికి తన గదిలోకి తీసికెళ్ళి కూచోపెట్టి యింక నలుగురున్నారు. పంపేసి వస్తాను. యీ బొమ్మల పుస్తకాలుచూస్తో కూచో" అని వెళ్ళాడు.

గది చుట్టూ పటాలు చాలా 'టేస్టు'గా అమర్చి వున్నాయి గోడలకి. సంస్కృత కవులు యింగ్లీషు కవులు రచించిన గ్రంథాలు గల చక్కని చిన్న లైబ్రరీ వుంది ఒక మూల. యింకో పక్కన తొక్కుడు హార్మోనియం నిగనిగలాడుతోంది. మెత్తని పరుపుల కుర్చీలో వెన్నువాల్చి

గూట్లోంచి నీలపుటాకాశం వేపూ, పూగులాడే పున్నాగ శిఖరాలవేపూ చూస్తో 'యేమి అదృష్టమూ !' అనుకొన్నాను. కాని యివన్నీ అన్యాయార్జిత విత్తమేకా అనుకున్నాను మళ్ళీ. తలుపు పైటనుంచి కల కలమనే నవ్వులూ, పరుగులెత్తే పిల్లల అరుపులు, వంగపండు చీరె చెరగులూ, బంగారు గాజుల చప్పుళ్లూ, నన్నాకర్షిస్తున్నాయి. చక్కని యింగువ వాసనోసారి తాకింది నా ముక్కుల్ని. బ్రాహ్మణ వేదపఠన మోసారి విన బడ్డది. సుబ్రమణ్యం వొచ్చి స్నానానికి లెమ్మన్నదాక అట్లా గడిచింది కాలం. వాళ్ళ ఐశ్వరము భోగమూ చూస్తే కుచేలుడు కృష్ణుడి యింటికి వెళ్ళినట్టుంది. ఆ యింట్లో పెద్ద దగ్గర్నుంచి చిన్న వరకూ నా స్నేహితుణ్ణి చూస్తే అభిమానం, భక్తి, ప్రేమ అతడేదన్నా మాట్లాడితో అతన్ని సంతోష పెట్టడం కోసం అందరూ పరుగెత్తుకారు. నౌకర్లు అతనికి తమ ప్రాణాలర్పించడానికి ఏ మాత్రం సంశయించరు. అతనిలో నుంచి ఎప్పుడూ సంతోషమూ, దయా యితరులపైకి ప్రవహిస్తో వుంటాయి. అందరి దేవుళ్ళ అన్ని వరాల్ని అతని మీద వర్షించినట్లు కనబడుతుంది. ఆనంద నిలయాన్ని ఆ గృహాన్ని చూస్తే ఎవరిమీదా ద్వేషమూ, ఈర్ష్యా, లోభత్వమూ, విచారమూ అతనిలోనే కాదు, ఆ యింట్లోనే లేవు అని తోస్తుంది. భోజనమై వాళ్ల గదిలో కూచున్నప్పుడు "స్లీడరీ మీద నీ పూర్వ ఉగ్రం తగ్గిందా?" అన్నాడు సిగ్గుపడుతో. లేదన్నాను.

సు :—యింతానీ అభిప్రాయం మేమంచరం నీచులమనేనా ?

నేను:—కాకపోతే యివన్నీ ఎట్లా సంపాయించావు ?

సు :—తలలుకొట్టి దోచుకున్నా ననుకుంటున్నావా యేం ?

నే :—అవును. నిష్కాపట్యానికి నేను ప్రసిద్ధి.

సు :—పడ్డ కష్టానికి ఫలిత మాసించడం తప్పేనా ?

నే :- -న్యాయమైన కష్టమైతేగా ? అబద్ధాలాడించడమేగా !

సు:—సిపాయి యుద్ధంలో చంపుతాడు. హంతకుడే ?

నే :—ధర్మయుద్ధం న్యాయమే.

సు: —ఎదుటి వాళ్ళు అధర్మయుద్ధం చేస్తే ?

నే : —మనం ధర్మయుద్ధమే చెయ్యాలి.

సు:—ఆ విధంగానే మన రాజపుత్రుల్నీ, వాళ్లనీ నమ్మి మన దేశం నాశన మయింది.

నే :—ధర్మం మిగిలింది.

సు:—అదేమూలా కనబడదు దేశంలో యిప్పుడు.

నే :—కోర్టులో కనబడదు.

సు:—కోర్టులో అబద్ధమాడించకపోతే, నీ నిజం అబద్ధమౌతుంది.

నే :—అబద్ధం అబద్ధంచేత నశిస్తుందా ?

సు:—జీసస్ క్రైస్తులాగు మాటలాడకు మరి. కోర్టులో తెలివి తక్కువ అబద్ధం, తెలివిగల అబద్ధం చేత నశిస్తుంది.

నే : -నశించదు. ప్రజల్లో అబద్ధ మెక్కువవుతోంది.

సు: దేశం తిరిగావుగాని ప్రజల స్వభావం నీకేమాత్రం తెలీదు. యీ పార్టీలకి మేమబద్ధాలు నేర్పా మనుకున్నావు. వాళ్ళే నేర్పుతారు మాకు. పనికిరాని తెలివి గలవీ, తక్కువ అబద్ధాలు ఆడకుండా అవసరమైనవీ, తెలివైనవీ మాత్రమే ఆడమంటాం మేము.

అతనితో వున్న నాలుగురోజుల్లో అతని ధాతృత్వము, ప్రజాసేవ, ఉత్సాహమూ అన్నీ వ్యక్తమైనాయి నాకు. బారుయాములో అతను ప్రవేశించగానే అందరి మొహాలు విప్పారి నవ్వుతాయి. నీచమూ అవ్యక్తమూ అసభ్యమైన మాటలు మాట్లాడ వెరుస్తారు అతనిముందు. అతనికి అందరిమీద విశ్వాసమూ దయా భక్తి. ఆ నాలుగు రోజుల్లో నాతో ఒకరిని గురించి నిందాపరంగా ఒక్క మాట మాట్లాడలేదు. అతను తనతోడి మానవుల్నీ లోకాన్ని ఎంతో ప్రేమిస్తున్నట్లూ, వారినించి

సంతోషం పొందుతున్నట్టూ వున్నాడు. బీదవారికి ఉచితంగా వ్యాజ్యాలు వెయ్యడంలో, బాధలు పడేవారినీ, యితరుల దౌర్జన్యంలో అణిగి పోయిన వారినీ నిలబెట్టి వారికై పోట్లాడడంలో అతను తన జీవితాన్ని సగమిచ్చేస్తాడు. క్లబ్బులో అతను లేనిది వాళ్ళకేమీ తోచదు. ఇంక ముఖ్యంగా అతన్ని రాత్రి భోజనం కాగానే పిల్లలతో చూడాలి. ఎక్కణ్ణించో ఒక కథ లేక ఆట తీసుకొస్తాడు. గంట రెండు గంటల సేపు ఇల్లంతా రంగస్థల మవుతుంది. ఆ పిల్లలు ముగ్గురూ ఎప్పుడూ ఆడుతూ పాడుతూ విచారమూ దెబ్బలా భయమూ యేమీ లేక ముచ్చట కొలుపుతో వుంటారు. నే వెళ్ళేముందు పదివేల రూపాయలు యిన్స్యూరు చేసి, ఠాగూరు పుస్తకాలు నాకు నాలుగు బహుమతి యిచ్చి పంపాడు.

ఒక యేణ్ణర్థమయింది నేను మళ్ళీ బెజవాడ వొచ్చేటప్పటికి. సరా సరి సుబ్రమణ్యం యింటికి వెళ్ళాను, రైలు సంచి పట్టుకుని. చూడగానే నిర్మానుష్యంగా కనబడ్డది. ముందున్న చెట్లు కొన్ని వాడిపోయినాయి. అటూ ఇటూ గడ్డి మొక్కలు అడవిలాగు పెరిగిపోయినాయి. ఎన్నడూ లేనిది వాకిలి తలుపు దగ్గిరగా వేసివుంది, పొద్దున్న పది గంటలకే. ఆశ్చర్యపడుతూ, కనుక్కుందామని తలుపు తట్టాను. అదే తెరుచుకుంది. హాల్లోకి వెళ్ళాను. బల్లలూ కుర్చీలు అన్ని మూలలకి జరిపారు. చుట్టూ మధ్యా అంతా దూది దారాలు, రాట్నాలు, వాడిల్లు మార్చి వుంటాడని వెనక్కి తిరగబోతూ వుంచే, పెద్దబ్బాయి వెనుకనుంచి వస్తూ కనబడ్డాడు. అతని వాలకం చూడ్డంతోటే ఆ గృహానికి మూడిన ఆపదే అతన్ని పట్టిం దని తెలుస్తోంది. తామరకాడలాగు సన్నగా వేళ్ళాడే చేతులు, కాంతికి దూరంగా పెరిగిన మొక్కలాగు జీవంలేని మొహమూ, శూన్యంతో నిండిన దృష్టులూ, అన్నీ ఆ కథే చెప్పాయి. చిరిగిన జల్లెడలా గల్లిన ఖద్దరు చొక్కా వేసికొన్నాడు. బంతిలాగు గంతులేసే కాలంలో వున్న

నిక్కరూ షర్టూ మాయమైనాయి. "జ్ఞాపక ముందిటోయ్" అంటే, మాట్లా డ్డానికి శక్తి లేనివాడివలె తల వూయించాడు.

నే :- నాన్నగా రేరీ?

కుర్రాడు:- బైటికి వెళ్ళారు అని లోకంతో పనిలేని ముసలివాడివలె అక్కడే గుమ్మం పట్టుకుని నుంచున్నాడు.

నే :— అట్లా ఉన్నావేం. ఒంటో బావుండలేదా?

కు :— నాక్కాదు, తమ్ముడికి.

నే :— తమ్ముడికేం?

కు :— క్షయ.

నే :— క్షయా? యెక్కువగా వుందా?

కు :— యేమో! అమ్మ యేడుస్తోంది.

నే :— నాన్నగారు డాక్టరు కోసం వెళ్ళారా?

కు :— లేదు. ఇంగ్లీషు డాక్టర్లు చంపుతారు మనుష్యుల్ని.

నే :— చంపుతారా!

కు :— వాళ్ళొచ్చిం తరువాతే యీ క్షయా అవీ మన దేశంలోకి వచ్చాయి.

విన్న మాట అప్పచెపుతున్నాడు. సంగతులు సగం అర్థమైనాయి నాకు.

నే :— నువ్వు బడికి వెళ్ళడం లేదా ?

కు :— ఆ యింగ్లీషు బడికి వెళ్ళడం దేశద్రోహం—ఇంగ్లీషు చదువుల వల్లనే మన దేశం బానిస దేశ మయింది.

నే :— నీకు బడి మానెయ్యడం బావుందా?

చప్పున అప్రయత్నంగా అతని కంటి గుడ్లలో నీళ్ళు తిరిగాయి.

కు :— కాని నాకు చాలా దిగులేసింది. నేను మానేస్తానంటే మా దొర సాని యేడ్చింది. నేను కడుతున్న అట్టల వంతెన సగంలో వదిలే

శాను. నాటకంలో "ఆల్ ఫ్రెడ్" వేషం కూడా వెయ్యడానికి వీల్లేదు. "వాయిలెట్" కూడా నాతో వేషం వేస్తోంది. ఎన్నడూ నా జన్మలో ఆ అమ్మాయిని చూడకుండా వుండనని ఒట్టు కూడా వేశాను. యెంత యేడ్చింది! కాని దేశానికి త్యాగం చెయ్యవద్దూ?

నే :— మరి చదవడమే లేదా?

కు :— ఇక్కడో కొత్త బడికి వెళ్ళాను. నా క్రాప్ చూసీ నా ఇంగ్లీషు మాటలు చూసీ, నా నడకను చూసీ ఆ టీచరు ఒకటే యెక్కిరి స్తాడు. అందుకని మానేశాను.

నా హృదయం కరిగిపోయింది. దగ్గిర కూచోపెట్టుకొని రైలులో నేను చూసిన తమాషాలూ, విన్న మాటలూ, మా బావ మూర్ఖమూ- అన్నీ చెప్పి చాలాసేపు నవ్వించాను. ఇంతలో సుబ్రమణ్యం ముసలి తండ్రి దగ్గు కుంటో వచ్చాడు.

"యెవరది మీరా? చాలా రోజులకి వొచ్చారే? మీరు మీ సీమ బట్టల్ని మానెయ్యలేదే?"

నే :— లేదండి. బావున్నారా?

తం:— అడుగుతున్నారా, చుట్టూ కనబడటంలా మా వైభవం? చూశారా? ఆయన వృద్ధకంఠపు వొణుకు నాకు జాలి పుట్టించింది. పోయిన సారి నే చూసినప్పటికంటె పదేళ్ల ముసలివాడై నాడు.

తం:— నా వృద్ధాప్యం సౌఖ్యంగా, ఆనందంగా మావాడి చేతుల్లో గడిచి పోతుందనుకున్నాను. కాని విధి కన్ను కుట్టకండా వుంటుందా? అంత అదృష్టాన్ని అంత కాలమూ అనుభవించనిస్తాడా? నానుకోప రేషనట, ఇదొకటి సృష్టించాడు ఓ మతి పోయినవాడు. స్వదేశమని, ముతక బట్టలనీ రాయటం, మా వాడిలోటి వాళ్ళందరు తాళమేసి పనులు మానుకోడం! నెల తిరిగేప్పటికి రెండు వేలుకళ్ళ చూసే

వాడండి. కోర్టు మాను, మాను అన్నవాడే గాని ఈనాడు ఒక పైస ఇచ్చేవాడు లేడు. యింతలో ముసలమ్మ వచ్చి కూచుంది.

ముసల:— పోనీ డబ్బు పోతే పోయింది. వాడన్నా సంతోషంగా చింత లేకుండా వుంటే సంతోషిస్తును. ఆ చలాకీ ఉత్సాహం అన్నీ పోయినాయి. దేశ దారిద్ర్యం, ఈ ఊరి వాళ్ళ దుర్మార్గం అన్నీ పాపం వీడి మొహాన్నే వేళ్ళాడు తున్నాయండి. తను దరిద్రుడై భార్య పుస్తెతో కూడ స్వరాజ్యానికిచ్చి మమ్మల్ని, కాటిలో కాళ్ళు పెట్టుకున్నవాళ్ళని ఏడిపించడమా దేశ దరిద్రం పోగొట్టే విధం? ఇదిగో, ఈ చక్రాలు తిప్పమంటాడు, పొద్దున్ననించి సాయంకాలం దాకా. యెన్నడూ లేనిది ఒకసారి ఆ చిన్న కుర్రాణ్ణి కొట్టాడు— ఏదో నూరు గజాల దారం వెయ్యలేదని. ఈయన్ని రోజూ రొట్టె పాలు డాక్టరు తీసుకోమన్నాడు. అవీలేదు. యేంరా అంటే దేశంలో తిండిలేక వేలకు వేలు, చచ్చిపోతూ వుంటే మనకి రొట్టె యెందు కంటాడు. వాడో! వాడు తిండి మానేశాడు. ఈ స్వదేశ మేమిటో ఈ గల్లం తేమిటో గాని మేం చచ్చిపోతున్నాము నాయనా!

తం:— నన్ను పిన్నను తెచ్చుకోనీడు. ఆ దొర లందరూ ఘాతకులు, దేశ విరోధులూ, గర్విష్ఠులంటాడు. వీడికేం తెలుసును ? నేను స్మిత్తు దొరగారి దగ్గిర పనిశాను. పదిహేనుమంది మనవాళ్ళ కిందా పని చేశాను. చెపితే వినేవా డెవడండీ? ఆ నిష్పక్షపాతం, ఆ దయా, ఆ కరుక్టునెస్ వాళ్ళకి కాక యింకెవరికుంది ? ఆ జగన్మాత విక్టోరియా రాణి పోయిన రోజున .... ఎందుకు లెండి మిమ్మల్ని విసిగిస్తున్నాను గావును.

నే :— లేదండి. చెప్పండి!

తం:— ముప్పైఏళ్ళ కింద లేని దేశదారిద్ర్యం ఇప్పుడే మొచ్చిందండీ ? అప్పుడంతా సుఖంగా లేమూ, పూర్వం ఇంత ధనం ఉండేదా

దేశంలో? దొరలట, పంజాబులో కాల్చారట ప్రజల్ని. తిరగబడ్డ ప్రజల్ని కాల్చకపోతే ప్రభుత్వ మెట్లానండి? ఇంక రేపట్నించి దొంగల్ని జైదులో పెట్టడం, ఉరితియ్యడం కూడా తప్పేనంటారు గావును—ఇంక ప్రభుత్వ మెందుకు?

ఇంతలో సుబ్రమణ్యం వొచ్చాడు, మధ్యాహ్నం పన్నిండయింది. ఒళ్ళంతా చెమటపోసి మొహం యెండ కొట్టింది-మనిషి సగమైనాడు; గడ్డం పెరిగింది-ఆ మురికి మురికి బట్టలేసుకొని వికృతంగా వున్నాడు. నన్ను చూడగానే సంతోషం చూపించాడు గాని-తిరిగి వాన తెచ్చే మబ్బు లాగు ఏవో ఆలోచన కళ్ళని కప్పింది. అతని కాళ్ళ చప్పుడు విని భార్య బయటికి వొచ్చింది.

"శేషు కెట్లా వుంది?"

"మళ్ళా తెర వొచ్చింది. చాలా భయపడ్డాను. మీ కోసం కబు రంపితే మీరు కనపళ్ళేదు."

"మా అబ్బాయికి జబ్బుగా వుంది. రా" అని నన్ను కూడా గదిలోనికి తీసికెళ్ళాడు, మృత్యు వా పిల్ల వాడి మొహాన రాసి వుంది.

"వైద్య మేమిటి?"

"వైద్య మేం చేస్తుంది? తొట్టి స్నానం చేయిస్తున్నాము. కాని ఉపయోగం కనపళ్ళేదు."

"మదనపల్లి —"

"మదనపల్లి, ఆ వెస్టరన్ నాన్సెన్సు నా ముందు మాట్లాడకు."

మృత్యువు సగం కబళించిన ఆ యింట్లో యెట్లాగో భోజనం చేసి వాడి గదిలోకి వెళ్ళాము. మూల ఒక చాప తప్ప, ఇంత బూజు దుమ్మూ తప్ప యేమీలేవు ఆ గదిలో.

"నీ లైబ్రరీ, పటాలు?"

"అన్నీ అమ్మేశాను. అయిదు కోట్ల ప్రజలు మల మల మాడుతూ వుంటే—"

"ఈ చల్లని గాలిని, బయట ఆకాశాన్ని, ఆ పున్నాగ చెట్టునీ ఎవరూ కొనలేదు గావును" అన్నాను. కడుపుమంట భరించలేక.

నా వంక చూసి, "ఇంకా నన్ను వెక్కిరిస్తున్నావా, ఈ మాల గుడ్డలు కట్టుకుని?" అన్నాడు.

"నా సంగతి పోనీలే, కాని నువ్విట్లా తయారైనావేం? దేశసేవ యే మాత్రం నీ వొంటికీ మనస్సుకీ పడ్డట్టు లేదు."

"ఇంకా ఈ ఆరోగ్య మున్నందుకూ, ఆ తెల్లని బియ్యపు అన్నం తింటు న్నందుకూ, నీ బోటి స్నేహితులతో నాలుగు నిమిషాలు మాట్లాడి నందుకూ, నా అంతరాత్మ బాధిస్తో వుంటుంది. ఇంతకాలం మన చుట్టూ ఇంత విచారం, దారిద్ర్యమూ పెట్టుకుని, నెత్తిమీద ఇంత బానిసత్వాన్ని ధరించి యెట్లా బతికామో! ఆహారం, నిద్ర లేకుండా ఎన్నేళ్ళు పనిచేస్తే దేశం బైట పడుతుందోగాని!"

ఏ మాత్రమూ కాపట్యం లేని నిర్మలమైన ఉద్రేకంతో వాడి కళ్ళు మెరిశాయి, పెదిమెలు వొణికాయి.

"కాని యీ క్షోభేమిటి? ఈ యిల్లేమిటి?"

"పూర్వపు దుబారా, షోకూ లేవనేనా? మరి యింకా త్యాగమంటే యేమిటి?"

"తండ్రి సౌఖ్యం, పెళ్ళాం నగలూ, పిల్లల ఆరోగ్యం — ఇదంతా త్యాగం చెయ్యడమూ, దేశసేవేనా?"

"వెక్కిరిస్తున్నావు. కాని సంబంధ మేమిటి?"

"పోనీ నీకీ జీవనం ఆనందంగా వుందా?"

"ఆనందమా? ప్రస్తుతావస్థలో ఒక్క నిమిషం ఆనందంగా వుండటానికి ఎవరికుంది హక్కు?"

"పోనీ, నీ రెండువేల ఆదాయం, నీ భార్య నగలూ, నీ ఆనందం, ఇంటి వారి ఆనందం, పిల్లల ఆరోగ్యం ధారపోశావు. ఎంత సహాయం అయింది దేశానికి?"

ఒక్క రవ్వసేపు కూచున్నాడు.

"అవును. అది నాకు విసుగు పుట్టిస్తుంది. అందరూ, యీ నాయకులందరూ స్వార్థపరులు. ఈ నెల ఆదాయం నష్టం కాక, పైగా నా స్వంత సొమ్ము యిరవై వేలు యిచ్చాను. దానికి లెక్క చెప్పమంటే చెప్పరు. చివర చివరకి చూడగా అంతా స్వలాభాపేక్ష తప్ప ఇంకేమీ లేనట్లుంది. ఒక్క పంచముల సంగతి తీసుకో. నేను పంచముల్ని రానిస్తున్న దగ్గర్నించి, ఒక్క బంధువూ యీ యింటి గడప తొక్కలేదు. అంత మాత్రం త్యాగం చేసినవాణ్ణి చూసి యిప్పటికీ యింకా చందాలు వెయ్యమనేవాడే కాని, మా ఇంట్లో మేము పడే బాధలు కనుక్కునే వా డెవ్వడూ లేడు. చెత్తా కానీ మనుషులందరూ దేశ యోధులిప్పుడు, నాలు గెకరాల పొలం దాచుకొని, పది రూపాయల పని వొదులుకొని, దేశౌన్నత్యం సంగతి గట్టిగా గంటన్నర అరిచే వెంకటేశ్వర్లుకి నాకన్న గౌరవ ముంది. నాకు గౌరవం కావాలని కాదు. కాని-" వూరుకున్నాడు. "నా దగ్గిర స్వరాజ్యనిధి కిచ్చిన తాలూకు సొమ్ము, నాదే, మూడు వంద లుంటే, దానికి ఖర్చు అడిగారు."

"పోయినసారి నేను వచ్చినప్పుడు ప్రతి వాణ్ణి విశ్వసిస్తున్నావు. యింతలో లోకం మారలేదు కదా?"

"తెలుసుకున్నా నిప్పుడు."

"ఆ విశ్వాసమే నయమేమో!"

"తెలివి తక్కువ."

"కాని ప్లీడరు పని న్యాయమే నన్నావుగా?"

"అంత నీచ మింకోటి లేదు. చిన్నప్పుడు మన మనుకున్న మాటలే నిజం."

"కాని నీ ముసలి తండ్రి, నీ భార్య, పిల్లలు - ఎవరికీ యిష్టం లేనట్టుంది."

"మూర్ఖులు, వారికే సౌఖ్యాలు మరిగి-"

"కాని వాళ్ళ సౌఖ్యం కూడా పాడు చెయ్యటానికి నీకే మధికారముంది?"

"ఈ బీదలు తిండిలేక మాడుతూ వుండగా, సుఖపడ్డానికి వాళ్ళకేం హక్కు ఉంది?"

"కాని వీళ్ళా కారణం?"

"అందరమూనూ."

ఇంకా ఆ పిచ్చివాడితో మాట్లాడే దేమిటని వూరుకున్నాను.

అతని పెద్ద కుర్రవా డొచ్చి భయపడుతో "నాన్నా, నాకు కథల పుస్తకం తెచ్చిపెడతా నన్నారు. తెచ్చారా?" అన్నాడు.

"జ్ఞాపకం లేదు."

"పోనీ, నేను మా స్కూలుకి పోయి——"

"వెధవా, ఆ స్కూలు సంగతి మళ్ళా ఎత్తావంటే-"

పిల్లి లాగు ఒదిగి వెళ్ళిపోయినాడు.

"కాని నీ స్వభావ మెంత మారిపోయిందో తెలుసా? నీ అవిశ్వాసమూ, నీ చిరాకూ, నీ తలిదండ్రుల మీది కోపమూ-"

"ఏం చెయ్యను? ఈ దారిద్ర్యం, ఈ ఆకలీ...." వూరుకున్నాడు.

సాయంత్రం చెట్టు కింద దిగులుగా నుంచుని దీపంలేని ఆ ఇంటి కేసి చూస్తున్నాను. సుబ్రమణ్యం యేదో మీటింగుకు పోయినాడు. మెల్లి గా నాకేసి ఎవరో వస్తున్నారు.

దగ్గిరికి వొచ్చి, "ఒక్క ఐదు రూపాయ లుంటే ఇవ్వరూ!" అంది సుబ్రమణ్యం భార్య సిగ్గుతో తల వొంచుకుని.

"ఇంట్లో సంచిలో ఉన్నాయి. అబ్బాయి చేతికిచ్చి పంపుతాను. ఐదు చాలా?"

"పది వుంటే ఇవ్వండి. అబ్బాయి కివ్వ వొద్దు. తరవాత వీలు చూసుకుని, ఎవరికీ తెలీకండా నాకే ఇవ్వండి."

అటు తిరిగి మళ్ళీ అంది. "ఇప్పుడు జేబులో ఒక పావలా అన్నా లేదా?"

సుబ్రమణ్యం భార్య !

కిందపడి యేడవా లనిపించింది నాకు.

"లేదమ్మా! ఇప్పుడే నేనే తెచ్చి ఇస్తాను. ఇక్కడే వుండండి."

"వొద్దు. జేబులో ఉంచుకోండి. నేనే వొచ్చి అడుగుతాను." అని మెల్లిగా చీకట్లోకి, ఆ మృత్యు గృహంలోకి దెబ్బలు తిన్న దెయ్యంమల్లే వెళ్ళింది.

# హరిజన సమస్య

గంటకి నలభై మైళ్ళ వేగంతో ఎగిరిపోతున్న కారు ఏమీ మారు మాట లేకుండా ఆగిపోయింది రోడ్డు మధ్య. అరగంట సేపు డ్రైవరు తెలికి చూసినా, ఉలకలేదు, పలకలేదు. ఈ అద్దె కార్లు ఇంతే, నమ్మడానికి వీల్లేదు అనుకున్నాడు వెనక సీట్లో కూచున్న డైరెక్టరు. అనుకుంటేచాలు, యజమాని మాటని గ్రహించి పరిగెత్తే సజీవమైన జంతువుమల్లే, మంత్ర బలంతో ఎగిరే పుష్పకం మల్లే వెళ్ళే కారు, ఏ మాత్రం ఇన్‌టిమేషన్ లేకుండా వుత్తరాయిమల్లే అయిపోవడం ఎంత ఆశ్చర్యం అనుకున్నాడు. అతని పక్కన కూచున్న కథకుడు! గదుల్లో చెయ్యడానికి సిగ్గుపడే పనుల్ని కార్లలో చెయ్యడానికి ఉపయోగించుకోడమే గాని, కారు బానెట్ తెరిస్తే దయ్యాలుంటాయో, పేగులుంటాయో కూడా తెలీదు వాళ్ళిద్దరికీ.

"ఇంక లాభం లేదంటావా?"

"ఎప్పే ఫరవాలేదు. కూచోండి."

"ఫరవా ఏం లేదు లే. రాత్రికి తిండి లేకపోయినా, కప్పుకు పడుకోడానికైనా ఏం లేదు."

ఆ రోడ్డు తమ కారు వెళ్ళడానికి మాత్రమే బోర్డువారు నిర్మించి పట్టున్నారు. అరగంటలో ఏ బండిగాని, కారుగాని, మనిషిగాని, అటు రాలేదు.

చుట్టూ చిట్టడివి. ఆ అడివితో ఏ మనిషికీ, మృగానికీ, పిట్టకీ కూడా అవసరమున్నట్టు తోచదు. "ఈ సిట్యుయేషన్ చాలా బావుందోయ్.

నీ కథానాయికని ఇట్లాంటి చోట strand (స్ట్రాండ్) చేయించు" అన్నాడు డైరెక్టరు. సాయంత్ర మవుతోంది. ఇంకా యాభై మైళ్ళు పోవాలి. మధ్యాన్నం ఎండనించి కారుని రక్షించిన చెట్లు, బెంగ పుట్టించే నీడల్ని పొడుగు చేసుకుంటున్నాయి.

మిథ్యావ్యవహారం మీద బైలుదేరినందుకు బాగా జరిగింది. ప్రొడ్యూసర్ తాను వలచి తెచ్చుకున్న బరువు బాలీసుని కథానాయిక చెయ్యా లంటాడు. "నీ మూడు లక్షలూ గోదావరిలో పొయ్యక పోయి నావా, ఇంతదూరం వొచ్చి ఫిల్ముపేర తగలెయ్యడ మెందుకు?" అన్నాడు డైరెక్టరు. తనకి వశ్యురాలు కాని అనాఘ్రాత పుష్పాన్ని అని చాటుకునే ఒక పేరెక్కిన నక్షత్రాన్ని కథానాయికిగా తీసుకుని తాత్కాలిక ప్రాణ నాయికను చేసుకోవాలని డైరెక్టరు తాపత్రయం. తన పినతండ్రి కూతురూ, తనకి ప్రేమాస్పదురాలైన విద్యావతిని మనస్సులో పెట్టుకుని వర్ణించి కథ రాశాడు కథకుడు. తమ అంతరార్థాలని ఎవరూ బైట పెట్టక తర్కించు కున్నారు మూడు నెలలు. చివరికి విసుగెత్తి, ఎవరూ వినని కొత్త కన్యను సంపాయిస్తామనే మిషతో బైలు దేరారు, talent (టాలెంట్) అన్వేషణలో. ఆ పల్లెటూరు వెళ్ళి వొస్తావుంటేనే ఈ విఘాతం పాపం, వాళ్ళకి. ఆమె తన ఫోటో పంపి, పెద్ద ఉత్తరం రాసింది. ఒక యాభై వేలు తాము పెట్టుబడి పెడతా నంది. యాభై వేల మూటతోనూ ప్రయాణమయింది వీళ్ళద్దరితోనూ. అప్పటి కప్పుడే పాడింది, ఆడింది, నాటకాలు వొప్ప చెప్పింది, చాలా బాగానే వుంది వ్యవహారం. అసలు మర్నాడు బైలు దేరదామనుకున్నారు. కాని ప్రతి అదృష్టానికీ అడ్డంగా ఓ వక్రగ్రహం వుంటో వుంటుంది. ఆ మధ్యాన్నం డైరెక్టరు నిద్రపోతూ వుండగా గుండెల మీద కూచుని లేవకొట్టాడు, కాంతారాయుడు. అతని దా పూరని కూడా తెలీదు డైరెక్టరుకి. కాంతారాయుడు మూడు హత్యలకనా

కారకుడని ప్రసిద్ధి. లక్షాధికారి, ప్రభుత్వపు మంత్రుల్లో ఒకరిని సింహాసన మెక్కించిన మనిషి. డైరెక్టరు కళ్ళు తెరిచాడో లేదో, బొబ్బిలి పాపా రాయుడి మల్లే, ఒథెల్లో వేషంలో రాఘవాచారిగారి మల్లే శబ్దం లేకండా గర్జించాడు.

"అది నా తమ్ముడి భార్య, దానికి సినీమాల పిచ్చెక్కింది. దాన్ని చేర్చుకున్నావా, మీ ఫిల్ముకి వేరే డైరెక్టర్ని చూసుకోవాలి. నువ్వు పొలి మేర దాటవు. నా పేరు కాంతారాయుడు!" అని అంతర్ధానమైనాడు.

ఎగబడి కారులోకి యాభై వేలతో పాకే ఆ కాంతాలలామని తప్పించుకుని పరుగెత్తుకువొచ్చారు వీళ్ళిద్దరూ. మధ్యలో కారు ఆగింది. వెనక కాంతారాయుడు రావటం లేదుకద! ఈ డ్రైవరుకి లంచం ఇచ్చి ఆపించలేదు కద!

"దగ్గిర ఊరు ఎంత దూరం వుంటుంది?"

"ఏమోనండి. నా కీ రోడ్డు కొత్త."

ఏమైనా కానీ ఇంక ఆ నిర్జీవ ప్రదేశంలో నిలవకూడదు.

"మేం వెడుతున్నాం. కారు బాగైతే వెనకాల తీసుకురా."

నడక సాగించారు. చీకటి పడ్డది. దోవలో పాము లుంటాయో, పులులే దూకుతాయో! దూరంగా దీపం. దీపాలు; మెల్లిగా. అవి గాసు లైట్లు. ఇంకా కొంచెంలో చాలా మధురమైన సన్నాయి వాయిద్యం.

అమ్మా! ఏదో వూరు. పెళ్ళిగావును. కాని పెళ్ళిళ్ళ కాలం కాదు. అదృష్టాన్ని నమ్మలేదు ఇంకా వాళ్ళే. దెయ్యాలేమో! కాకపోతే పొరుగూరు వెళ్ళే పెళ్లి ఏమో! కాక కాంతారాయుడు కాదుకద! ఏమీ ఆశ్చర్యం వుండదు. లైట్లతో, వాయిద్యాలతో ఎదుకొచ్చి వాళ్ళిద్దర్నీ పట్టుకుని కట్టి తీసికెళ్లి ఏ పోలేరమ్మకో బలి ఇచ్చినా, ఈ నైజాంలో ఇంక దిక్కు-

మొక్కా ఎక్కడ? ఏం చెప్పిందో ఆ ఆడది? తనని వెనకనించి రమ్మన్నారని చెప్పలేదు కద బావగారితో!

సమీపించారు. తోటలు ఇళ్ళు, గుంపు. అదేదో సమాధి. తీర్థం లాగుంది. మొక్కుబళ్ళు చెల్లించుకుంటున్నారు. ధైర్యాలొచ్చాయి వాళ్ళకి. "చూశారా మూర్ఖం? మతం పట్టు వొదలాలంటారు ప్రభుత్వం" అన్నాడు కథకుడు.

"రాజకీయాల్లోకి తీసుకురా వొద్దంటారు, అంతే."

"జీవితంలో కల్లా ప్రముఖమైన కులం, మతం రాజకీయాల్లోకి రావడం ఆపడం ఎవరి తరం? అందుకనే రష్యాలో దేవుడి పేరు చెపితే నరికేస్తామన్నారు. ఎన్ని ఉపన్యాసాలిస్తే మాత్రం ఆగుతుందా ఈ దేశంలో?"

"రష్యాలో నరికేస్తామన్నారని నీకెట్లా తెలుసు?"

"అనుకుంటారు."

"రష్యాలో మల్లె ఇక్కడా చెయ్యాలంటావా?"

"తప్పకండా."

"అట్లా చేసి ఈ మూర్ఖమే పోతే, నీ కథలకీ, నా ఫిల్ములకీ ఏం డబ్బు వొస్తుంది? భక్తి పోయిందంటే, ఇంక చలం కథలే గతి."

"అంటే?"

"శృంగారం."

"శృంగారమైతే మాత్రం చలం కథలే ఎందుకు?"

"భక్తితోపాటు పాతివ్రత్యం మార్కెటు కూడా పడిపోతుంది. ఇంక బ్లాక్ మార్కెట్టే గతి, అంటే చలం."

"ప్రేమ లేదా?"

"వుందిలే. మీ రందరూ ఏం చేస్తున్నా రిప్పుడు మాత్రం? శృంగార ఘట్టాల్లో తెలిసో తెలీకో అతని వాక్యాలేగా దొర్లిస్తున్నారు."

"పోనీ, అభ్యుదయ కథలు తియ్యకూడదూ?"

"అంటే ఆకలేగా? ఆకలేస్తోంది. భోజనం సంగతి ఆలోచించు."

"ఏమిటి ఆ ఫలహారం తరవాత కూడానా? మధ్యాన్నం ఆకలీ, శృంగారం రెండూ కలిసి వొచ్చాయిగా నీకు?"

ఆమె బలవంతం చేసి ఆవడలు, పూరీలు, చంద్రకాంతలు, హల్వా, సేమియా వాళ్లిద్దరికీ నోళ్ళలో తన చేతులతో కూరింది.

"ఇంకా ఆకలి లేదులే. కాని...."

ఒక యువకుడు సమీపించి కుశల ప్రశ్నలు. పుట్టు పూర్వోత్తరాలు అడిగాలు వాళ్ళని. డైరెక్టరు పేరు పని చేసింది. తన యింటికి ఆహ్వానించాడు. పొద్దున్నే బండి చేసి దగ్గిర బస్సులు నడిచే రోడ్డుకి పంపిస్తానన్నాడు.

ముగ్గురూ పడిపోయిన చెట్టుమీద కూచున్నారు, తమాషా చూస్తో.

"ఏమిటి ఈ తీర్థం ?"

"తెలీదా మీకు ? హరియోగి గారి సమాధి అది. చంపేశాం ఆయన్ని మేము. ఇప్పుడు ఉత్సవాలు చేస్తున్నాం. మొక్కుకుంటాము; వ్యాజ్యాలు గెలవడానికి, పిల్లలకి, జబ్బులకి అన్నింటికీ."

"నిదర్శనం వుంటుందా ?"

."ఆఁ"

విద్యావంతుడి మల్లే ఉన్నాడా యువకుడు.

"ఎందుకు చంపారు ఆ యోగిని ?"

"చాలా మంచి కథ. వింటారా ?"

"కానీండి."

"అదేదో సినిమా చూస్తున్నట్టుగా వుంది, డైరెక్టరుకి కూడా. ఆ సన్నాయి వాయిద్యం; చామంతి, మందార, చంద్రకాంత పూలు పెట్టుకుని, పట్టు చీరెలు అలంకరించుకున్న యువతులు, పళ్ళాలలో పూజాద్రవాలు పట్టుకుని; లైట్లు, ఇంకా చలిలేని గాలి, చుట్టూ చీకటి, అడివి, ఆ దుంగ మీద వాళ్ళు ముగ్గురూ.

"నా చిన్నతనం. ఇరవై ఐదేళ్ల కింద గావును, ఎక్కణ్ణుంచి వొచ్చాడో ఓ నాడు మా వూళ్లో తిరుగు తున్నాడు. తెలుగు మనిషే. ఎన్నో ఏళ్ళు ఎక్కడో వుండి వొచ్చాడు గావును. అప్పటికే నడి వయసు దాటింది. ఒంటి మీద బట్టలేదు. మాట్లాడడు. కళ్లెత్తి ఎవరివంకా చూడడు. పిలిచి పెట్టినా, పళ్ళుతప్ప ఏమీ తినడు. త్వరలో అతన్ని మహాత్ముణ్ణి చేసుకున్నారు పీళ్ళే. రాత్రులు ఏ చెట్టుకిందో పడుకుంటే, పోయి గోల చేసేవాళ్ళు, పిల్లలకోసం, రోగాల నయంకోసం, తప్పిపోయిన గొడ్లకోసం, విసుక్కుని లేచిపోయి ఇంకో చెట్టుకింద పడుకునేవాడు. మేము పిల్లలం; పగలు అతన్ని ఏడిపించేవాళ్ళం- పెద్దవాళ్ళు చూడకుండా తిట్టీ, రాళ్ళేసీ, గడ్డంలాగీ. చాలా మందికి కోరికలు నెరవేరాయి అనేవాళ్ళు.

ఓ రాత్రి హఠాత్తుగా మాట్లాడాడు తెలుగులో, పిల్లలకోసం వొచ్చిన ఒకామెని-

"వెళ్ళి ఓ కుర్రాణ్ణి చూసి పడుకో. నా దగ్గిర ఏముంది" అన్నాడు నలుగురిలో.

దాంతో హడిలిపోయినారు.

ఆమె ఈ వూరి పెద్దరైతు భార్య. దాంతో అతని మీద ద్వేషం రేగింది. ఆనాటినుంచి అతను మౌనం వొదిలాడు. అతని గురువు మూడేళ్ళ మౌనం ఆజ్ఞాపించాట్ట ఆ గడువు తీరిపోయింది. ఓ చాప

చుట్టుకున్నాడు నడుం చుట్టూ. తరవాత ఎవరో బట్ట ఇస్తే అది కట్టుకున్నాడు. ఎందు కీవూళ్లో వున్నావంటే "ఆజ్ఞ" అన్నాడు. అతను మాట్లాడిం తరవాత ఎవరికీ ఏ వరాలూ రావడం లేదు, జబ్బులూ నయం కాలేదు. కడుపులూ రాలేదు. ఎవరన్నా వరం అడిగితే వేదాంతం చెప్పేవాడు. అతని ఖ్యాతిని విని పొరుగూళ్ళనుంచి వొచ్చేవాళ్ళు గుంపులు. "నాకు చిరకాలంనుంచి కడుపునొప్పి" అంటే, "కడుపు నొప్పి ఏముంది ? కాని నీ ఆత్మలో నొప్పి సంగతి ఏం చేశావు ?" అంటాడు.

"చాలా బీదరికం. కటికి దరిద్రుణ్ణి."

"దరిద్రమంత ఐశ్వర్యం ఎక్కడ వుంది ? నీ దగ్గిర పెన్నిధులు వున్నాయి; కావాలా నీకు ?"

"శల వివ్వండి."

"తవ్వు నీ మనసులోకి తవ్వు దొరుకుతాయి."

ఆ మాట లెవరికి కావాలి? మేం పెట్టే బాధలూ: నిరాదరణ పడలేక క్రమంగా హరిజనవాడ చేరుకున్నాడు.

అక్కడ సూరిగాడు కొంచెం మోతుబరి. ఓ రాత్రి అతని పసిపిల్ల వాడికి ఏదో జబ్బు పుట్టింది. తల్లీ తండ్రీ ఆ పసిపిల్ల వాణ్ణి ఈ హరియోగి కాళ్ళమీద పడేసి రక్షించమని కాళ్ళు పట్టుకున్నారు.

"మరి బతికిస్తే ఆ కుర్రాణ్ణి నాకు యిచ్చేస్తారా ?" అన్నాడు. ఏమంటారు, ఒప్పుకోక ! అంతే, ఆ నిముషాన జబ్బు పోయింది. దాంతో అదుగో దూరాన, ఆ కొబ్బరి తోపులో ఓ గుడిసె కట్టి ఆ సాధువుని దాంటో ఉంచారు. కాని ఆ పిల్ల వాణ్ణి తీసుకోనే లేదు యోగి. తలిదండ్రులు మాత్రం ఎన్నేళ్ళకీ ఆ కుర్రాణ్ణి యోగిగారి కుర్రవాడి కిందే చూశారు.

ఆ యోగిగారు అక్కడ స్థిరపడగానే ఆ హరిజనవాడకే యోగం పట్టింది. వాళ్ళ పొలాలు పండాయి. వాడి హెచ్చింది, ప్రభుత్వంవారు సహాయ పడ్డారు. యోగిగారి కీర్తి హెచ్చింది. మా వూరి ప్రజలు కూడా ఎగబడ్డారు. పొరుగూళ్ళనుంచి కూడా ఒకటే గుంపులు. మహత్యాలు జరిగాయి అని కొందరనేవాళ్లు. కొందరు ఏమీ లేదనేవాళ్ళు. క్రమంగా ఆయనే తగాదాలు పరిష్కారం చెయ్యడం, పోట్లాటలు మాన్పడం, సలహాలివ్వడం దగ్గరికి వొచ్చింది. సూరిగారి కుటుంబంమీద యోగిగారికి అభిమానంలాగు వుండేది. మొత్తానికి అతని కుర్రాడు వీరన్నని తన సొంత కొడుకులాగే చూసుకున్నాడు. మాతోపాటు వాడూ పక్కవూళ్లో హైస్కూల్లో చదువుకునేవాడు. శలవల్లో మేం పగలంతా యోగి గారి తోటలోనే గడిపేవాళ్ళం. ఒక్కొక్కప్పుడు రాత్రులు అక్కడే పడుకునేవాళ్ళం. హరిజనులు మా పేటలోకి రాకూడదు. కాని ఒక్క ఆ ఆశ్రమంలో మాత్రం సమానులమై కలుసుకోడానికి మా వాళ్ళకీ అభ్యంతరం వుండేది కాదు. మొత్తానికి ఆ నాటి మా ఊరి యువకు లందరమూ ఆయన శిష్యులం ఒక విధంగా. ఆయన మామూలు పురాణాల ధర్మసూక్తులే చెప్పేవాడు. సత్యం, శౌచం, అహింస, దయ, ఇట్లాంటివి. కాని అవి ఒక అనుభవంతో, నిశ్చయంతో వొచ్చి, మా మనసుల్ని నాటుకునేవి.

ఆయన వాక్కు వినడమే, ఆయన దగ్గిర కూచోడమే మాకో సంతోషం.

మేం కాలేజీకి వెళ్ళి నేర్చుకోడం, పత్రికలు చదవడం, దేశంలో పెద్దల్ని కలుసుకోడం, మా కాలేజీలో డిస్కషన్లు చెయ్యడం, రాజకీయాల పుస్తకాలు చదవడం- వీటితో మాలో మాకు భేదాభిప్రాయాలే గాక యోగిగారి ధర్మబోధనలు వుత్త పురాతనపు చాదస్తాలనిపించాయి. శలవలకి

ఇంటికి వొచ్చినప్పుడు ఆయనతో వాదించేవాళ్ళం. ఆయన అన్నిటికి అంగీకరించేవాడు. కాని ఆ అంగీకారం మాకు తృప్తిగా వుండేది కాదు.

"ఈ పూజలూ, భజనలూ వుత్త అర్థంలేని పనులు. పురాతనపు మూర్ఖత్వాలు" అంటే-

"నవీన మూర్ఖత్వాలు పురాతన మూర్ఖత్వాల కన్న నయమా ?" అని నవ్వాడు.

"నవీన పద్ధతుల్లో మూర్ఖత్వం లేదు."

"కొన్నాళ్ళకి ఇవీ పురాతనమైన మూర్ఖత్వాలై పోవా ?"

"అసలు దేవుడున్నాడనడమే మూర్ఖం."

"ఎందుకు ?"

"వున్నాడని ఎట్లా తెలుసు ?"

"లేడని యెట్లా తెలుసు ?"

"లేనిదాన్ని తెలుసుకోడ మెట్లా ?"

"ఉన్నదాన్ని తెలుసుకున్నావా ?"

"దేన్ని ?"

"నిన్ను."

"తెలీకేం ?"

"తెలుసుకుంటే ఇంక దేవుడి ప్రశ్నే లేదు."

వేప చెట్టుకింద అరుగుమీద కూచుని జ్వాలల మల్లె పొడుగ్గా మెరిసే కొబ్బరాకుల వంక చూస్తో ఆయన నవ్వులో, చిన్న హేళనలో ఆయనతో సంభాషించిన రోజులు చాలా గొప్పవి. ఏదో శాంతమైన

వాతావరణం. మా ఆశల నించి, ఉద్యమాలనించీ, సందేహాలనించి, తిరుగ బాట్ల నించి దాటి పోయిన వాతావరణం వుండేది ఆయన దగ్గిర.

"ప్రస్తుత కాలానికి దేవుడు చాలా అనవసరం" అన్నాం మాలో ఒకరం ఓ వెన్నెల రాత్రి.

"ఏం ? నాకు మల్లేనే దేవుడూ ముసలి వాడై నాడు గావును."

"అదికాదు. మానవుడే సర్వశక్తిమంతుడై నాడు."

"ఇప్పుడేం, ఇదివరకూ సర్వశక్తి మంతుడే."

"కాని ఇదివరకు కన్న ఇప్పుడు."

"తనని తాను తెలుసుకుంటున్నా డన్నమాట,"

"కనక దేవుడు అనవసర మనుకుంటున్నాడు."

"చాలా మంచి లక్షణం."

"మరి మీరు ఈశ్వర భక్తిని ఎందుకు బోధిస్తారు?"

"శక్తి హీనులకి. మీ బోటి ధీరులకి కాదు."

ఆయన మమ్మల్నిచూసి నవ్వుతున్నా డనిపించింది. ఆయనకి తెలిసిందో ఏమో కొంచెం వుండి, మళ్ళీ అన్నాడు. "ఎప్పే. ఈశ్వరుడు చాలా అనవసరం. ఎందుకంటే అవసరం వొచ్చిననాడు కోపగించడు. 'ఈ నాటికి నాతో పని కలిగిందా?' అని ఎత్తిపొడవడు."

"అయితే దేవుణ్ణి మేం వొదిలెయ్యడం తప్పు కాదంటారా?"

"అనవసరమైనదాన్ని ఆహ్వానించడం చాలా అనవసరం. కాని ఈశ్వరుడి అవసరం చాల తప్పని అవసరం."

"మాకు అవసరం కాదు"

"చెపితినిగా. అవసరం కానన్నాళ్ళు చాలా అనవసరం."

ఇట్లాంటి platitudes (ప్లాటిట్యూడ్స్) మాట్లాడేవాడు ఆయన.

కాలేజీలో మార్పు చెంది ఆయన్ని ధిక్కరించిన మాలో ముఖ్యుడు సూరన్న కొడుకు. యోగి గారి ప్రేమ పుత్రుడు, వీరన్న. అతను తమాషాగా తయారై మానించి కూడా దూరమౌతున్నాడు. హరిజనుల్ని అగ్ర కులస్తులు చాలా ఘోరం చేశారనీ, చేస్తున్నారనీ ఇంక ఒక్కవారం, ఒక్కరోజు హరిజనులు ఆ దుర్గతిని సహించకూడదనీ, హరిజన విప్లవం వెంటనే లేవ తీయాలనీ అతని నిశ్చితాభిప్రాయం. ఏ ఉపన్యాసంలో, ఏ సంభాషణలో, యెక్కడైనా అప్రస్తుతంగా ఆదేమాట, అదే కలవరింత. అతని కేమన్నా పిచ్చి యెక్కిందేమో ననిపించింది. ప్రతి పత్రికకీ వ్యాసాలు పంపేవాడు, అదే పద్ధతి మీద. అచ్చు కానీ, కాకపోనీ. ప్రతి శలవల్లోనూ తన పేటలో హరిజనులకి ఉపన్యాసా లిచ్చి, యువకుల్ని రెచ్చకొట్టి ఒక సైన్యంగా తయారు చేస్తున్నాడు. ఆ ఉద్రేకాన్నే యోగి గారి ముందు వెళ్ళబోసేవాడు.

"హరిజనులకి జరుగుతున్న ఈ అన్యాయాన్ని ఎట్లా అంగీకరిస్తున్నారు మీరు?" అన్నాడు దూకుడుగా.

"ఆ అన్యాయాలు నా అనుమతి కోరందే" అన్నాడు ఆయన నవ్వుతో.

"మీరు వాటిని అంగీకరిస్తారా?"

"నే నేమిటి? ఎవరూ ఏ అన్యాయాన్నీ అంగీకరించరు."

"కాని, ఈ అగ్రకులంవాళ్ళు అంగీకరిస్తున్నారు."

"అంటే-వాళ్ళ కేదో న్యాయం కనపడుతోందన్న మాట."

"ఏం న్యాయం? స్వార్థం."

"ఆచారం, కాలం."

"అవి వొప్పుకుంటారా మీరు!"

"నా అంగీకారంతో గాని, అనంగీకారంతోగాని లోకం మారితే ఇంక కావలసింది ఏముంది?"

"నేను ఆచారాన్ని ఒప్పుకోను."

"చాలా మంచి పని."

"వాళ్ళు ఒప్పుకుంటారు."

"చాలా మంచిపని."

"రెండూ ఎట్లా మంచివౌతాయి?"

"నీహ్యా, నిప్పూ రెండూ మంచివైనట్టే."

"సరే లెండి. కాని నే నిదంతా మార్చబోతున్నాను."

"తప్పకుండా మార్చు."

"మీ రేమంటారు?"

"ఇప్పు డేమంటాను? మార్చావంటే-కబీరు, బుద్ధుడు, రామానుజుడి కన్న గొప్పవాడి నంటాను"

"ముందు ఈ వూరిని మార్చబోతున్నాను."

"మార్చెయ్యి. అదేదో నేనూ నేర్చుకుంటాను."

"ఏమిటి?"

"మార్చే విద్య."

"ఏంలేదు. బలవంతంగా చొరబడటమే!"

"చొరబడి మళ్ళీ బయటికి వొస్తావా, అక్కడే వుంటావా?"

నవ్వాను.

"ఆ ఆచారాన్ని పగలకొడతాను. ఎవ రడ్డమొస్తారో చూస్తాను."

"చూడనీరేమో!"

"వాళ్ళకి ఏం అధికారం వుంది, మానవుడు మానవుణ్ణి పశువుగా చూడడానికి?"

"నువ్వూ అదేగా చేస్తున్న పని?"

"నేనా?"

"మరి బలవంతంగా చొరబడేది పశువేగా?"

ఎంత నవ్వాను!

"సర్వసోదరభావం కలిగిస్తాను."

"సోదరుడితో బలవంతంగా కలబడి?"

"కలబడితేగాని బుద్ధిరాదు."

"బుద్ధి తెచ్చుకునే ప్రమేయం లేనే లేదా ఏమిటి, ఇతర్లకి బుద్ధి తెప్పించటమేగాని?"

వీరన్నకి చాలా కోపం ఒచ్చింది.

"మీ వన్నీ వుత్తమాటలు. తీరిగ్గా కూచుని దేవుడి న్యాయం, ఏర్పాట్లు అనే మత్తుమందు, బద్ధకం. నాకు మరణమన్నా భయం లేదు."

"జీవితమంటే భయమన్నమాట?"

ఓడిపోయినా ననిపించిందో, లేక పూర్వపు గౌరవం తిరగ బెట్టిందో "అయితే ఏం చెయ్యమంటారు?" ఇట్లానే హీన స్థితి ననుభవించ మంటారా?" అన్నాడు వీరన్న.

"అన్ని స్థితుల్లోకీ హీనస్థితి ద్వేషం; మనుషుడో, దేవుడో తనకి హీన స్థితి నిచ్చాడనే కోపం, తిరుగుబాటు."

"ఇదంతా పూర్వం నించీ బ్రాహ్మలు బోధించిన విషం; తక్కువ జాతుల్ని అణగతొక్కి వుంచడానికి."

"అగ్రజాతుల్ని అణగతొక్కడానికి ఈనాడు తక్కువ జాతులు బోధిస్తున్న కాలకూట విషం ఈ ద్వేషం" అని గట్టిగా అన్నారు యోగిగారు.

"మీరు అగ్రజాతుల వేపా?"

"ద్వేషం లేనివారి వేపు."

"వారికి లేదా ద్వేషం? "

"ప్రస్తుతం పైకి లేదు. నువ్వు నీ ద్వేషంతో దాన్ని రగిల్చిం దాకా."

"ఒక్క కులాలేకాదు; దేశాలు దేశాలమీద, బీదలు ధనికులమీద తిరగబడి తమ హక్కుల కోసం నిలబడే జ్ఞానం, పటుత్వం వొచ్చాయి ఈనాడు."

"తిరగబడడం జ్ఞానమూ, పటుత్వమూ కావు, అజ్ఞానం, బలహీనత, నిజమైన పటుత్వం తిరగబడదు. ఇదివరకు లొంగిపోయిన బలహీనతే తిరుగుబాటులోకి రూపం మారింది. అంతే."

"మరి ఇట్లా అణిగి, నలిగి క్షీణించవలసిందే?"

"బలం లేనప్పుడే అవన్నీ జరుగుతాయి."

"ఇంక మాకు సుఖమనేదీ అక్కర్లేదా?"

"సరైన మాటలకి వొచ్చావు. సుఖం దేనిమీద ఆధారపడి వుందో ఆలోచించుకో. సమత్వం, స్నేహం, సత్యం, సహనం - వీటి మీద. దేవుడు లేకపోనీ, ఈ విషయాలు ప్రతి హృదయంలో వెలుగు తున్నాయి. వాటి నించి తప్పి సుఖం లేదు. ఒకరు అన్యాయం చేస్తున్నా రని నువ్వు న్యాయం తప్పితే, నిన్ను కాపాడేందుకు రక్షణ ఏదీ? తగూ పెట్టి హక్కులు సంపాయిస్తావు. సుఖా న్నెక్కణ్నించి తెచ్చుకుంటావు?"

ఇట్లా వాదించుకునే వాళ్ళు వాళ్ళిద్దరూ. కాని యోగిగారి మాటలు వీరన్నకి నచ్చలేదు. చీకిన పురాణ నీతు లనేవాడు.

మా కెవరికీ తెలీకుండానే గ్రామ విప్లవాన్ని సిద్ధంచేశాడు. దసరా. మా వూళ్లో పెద్ద పూజలు, పందిళ్ళు, సంతర్పణలు, కలశాలు, ఊరేగింపులు. ఆ హడావిడిలో ఓ రోజు సాయంత్రం వచ్చి పడ్డారు హరిజనులు ఊరిమీద. కర్రలతో. నాకు తెలీగానే హడలిపోయినాను. ఎందుకంటే వీరన్న ఆంతర్యం నాకు తెలుసు.

"ఎప్పే - యీ ప్రభుత్వం చేసే శాసనాలు ఏం లాభం లేదు. ఎన్నటికీ కలుపుకోరు మమ్మల్ని. ఎన్ని శిక్షలతో బెదిరించినా, ఇంకా గ్రంథాలు వెతికీ తప్పించు కుంటారు. అట్లా కాదు. హరిజనులు విప్లవంచేసి మీ స్త్రీలకి హరిజన బిడ్డల్ని కనాలి" అనేవాడు.

అదీ నా భయం.

మా వూళ్లో పెద్ద హరిజన సమస్య లేనేలేదు. ఆ ముసలి వాళ్ళని నొప్పించడం యెందుకని మరీ ఇళ్ళల్లో కలుపుకోలేదు మేము వాళ్ళని - అంతే.

"పోనీ వీరన్న పదేళ్ళు ఆగవోయ్. ఈ ముసలి వాళ్ళని చావనీ, మనందరం ఏకమవుదాం." అన్నాను.

"అప్పటికి నువ్వు ముసలివాడవై ఇప్పటి ముసలాళ్ళ మల్లే నే పట్టుబడతావు. నువ్వు లేకపోతే తక్కినవాళ్ళు నీ మాట సాగనీరు. అదేం లాభం లేదు" అన్నాడు. అతను చాలా కసిగా. నిజమే ననిపించింది నాకూ.

ఆ దసరా నాడు ముందుగా హరిజనులు స్త్రీల గుంపు మీద పడ్డారు. వూరి మగవాళ్ళు చాలామంది పొలాల్లోకి వెళ్ళిపోయినారు. మధ్యాన్నమే. నాకేం తోచలేదు. ఈనాడు హరిజనులు దుర్మార్గం చేసినా, రేపు మావాళ్ళు వాళ్ళని నాశనం చెయ్యక మానరు. చప్పున యోగి జ్ఞాపకం వొచ్చారు. ఒక్క పరుగు తీశాను ఆశ్రమానికి. నా వీపు వెనక హరిజనులు బలవంతం చేస్తున్న స్త్రీల అరుపులు, వాళ్ళకి అడ్డుపడ్డ మా యువకుల గోల.

ఆశ్రమం చాలా ప్రశాంతంగా వుంది. చిలకలు గుంపులుగా ఎగురుతున్నాయి వేపచెట్ల మీదకి. నా కళ్ళముందు నెమ్మదిగా తొలిగి పోయినాయి ఉడతలు. గాలి తీరుబడిగా వీస్తోంది. చెట్టుకింద శాంతంగా

కబుర్లు చెప్పుకుంటూ కూచున్నారు స్వామిగారు, ఇద్దరు ముసిలమ్మలతో. నన్ను చూడగానే చిరునవ్వుతో, "రా, కూచో" అన్నాడు.

హడావిడిగా నా కబురు కక్కాను. వెంటనే ఆ డెబ్భైఏళ్ళు దాటిన వృద్ధుడు లేచాడు.

"చేశాడా, అంత పనీ!" అంటో నా కంటే వడిగా పరిగెత్తుతున్నాడు. ఆయన అట్లా ఆదుర్దా పడడం నేను ఎన్నడూ చూడలేదు. పుటకలేదు చావు లేదు అనే వేదాంతికి అంత ఆదుర్దా, మమకారం ఎందుకు? ఎవరికోసం?

ఆయన చాలాసార్లు చెప్పారు మా వూరి పెద్దలతో-"కాలం మారుతోంది. ఎందుకు ఏర్పడ్డదో ఈ వర్ణ భేదం-ఈ నాడు చాలా అన్యాయం, అసహ్యం. ఈ భేదాన్ని తీసెయ్యండి. రెండు పేటల్నీ కలిపెయ్యండి" అని.

"పెద్దలు తమరుకూడా అట్లాంటి వర్ణ సంకరాన్ని బోధిస్తారా? ఋషులు పెట్టిన నియమాలు" అన్నారు వాళ్ళు.

"ఈ నాటి ఋషిని నేను. నేను చెప్పేమాట వినండి" అనేవాడు ఆయన. కాని ఎవరు వింటారు?

అయిదు నిమిషాల్లో చేరుకున్నాం మా వూరు. ఆ దృశ్యం ఏం చెప్పను? ఈ లోపల మా స్త్రీలని ఎన్ని అవమానాలు చేశారో! దూరం

నించి పొలాల్లోంచి పరుగెత్తుకు వొస్తున్నారు మా వాళ్ళు-కర్రలతో, కొడవళ్ళతో, చేతి కత్తులతో.

సరాసరి అమ్మవారి పూజ పందిరిలోకి వెళ్ళాం. అక్కడ జరిగిన అసహ్యాం వర్ణించలేను. విగ్రహాన్ని పగలకొట్టారు. అమ్మగారి పీఠానికి ముందే వీరన్న నా భార్యని పట్టుకుని కిందపడేసి....పందిరి గుంజని పీకి ఒక్క దూకు దూకాను అడ్డపడ్డ స్వామిగారిని కింద పడతోసి. ఇంకా తన పెంపుడు కొడుకు మీదే మమత.

వీరన్న నన్ను చూసి అరుస్తున్న నా భార్యని వొదిలి పక్కనున్న కర్ర తీసుకుని నా మీదికి దూకాడు. తరవాత ఏం జరిగిందో-ఇద్దరం కొట్టుకున్నాం. చూసేసరికి రెండు దెబ్బలూ మధ్య అడ్డం వొచ్చిన యోగి గారికి తగిలాయి. ఆయన "హరి హరీ" అంటో ప్రాణం విడిచారు.

నిర్ఘాంత పోయినాము ఆ రక్తం చూసి. అంతే. అక్కడితో ఆగిపోయింది ఆ వైరం. ఎక్కడివాళ్ళు అక్కడ నిలిచి పోయినారు.

హరిజనులూ, మేమూ అందరమూ కలిసి ఆయనకి సమాధి కట్టించాము. ఎంతమంది మా స్త్రీలని హరిజనులు ఏం చేశారో కిక్కురు మనకుండా ఊరుకున్నాము. వీరన్న కోరిక నెరవేరింది. స్వామిగారి అనుగ్రహాన పిల్లలు లేనివాళ్ళకి కొంత మందికి తొమ్మిది నెలల్లో పిల్లలు కలిగారు. మా ఊళ్ళో హరిజన సమస్య లేదు. ఆదర్శమైన గ్రామం కింద వినుతి కెక్కింది. హరిజన సమస్యలను సాధించడానికి ప్రాణా లర్పించారని యోగిగారి కీర్తిని పత్రికల నిండా అచ్చు వేయించుకున్నాము. నాకూ,

వీరన్నకూ అర్నెల్లు కైదు పడ్డది. ప్రతి సంవత్సరం హరియోగిగారికి ఈ ఉత్సవాలు చేస్తున్నాము. మొదటినుంచీ అంత గొప్ప సంస్కర్తకి ఆశ్రయమిచ్చి ఆయన అహింసా బోధనల ప్రకారం నడుచుకున్న యోగ్యులకింద మా ఊరి పేరుని దేశమంతా చాటుకున్నాము. మా మూలానే హరియోగిగారు అంత గొప్పవారైనట్టూ ప్రగల్భాలాడుతున్నాము అన్నాడు."